# రామకృష్ణ జంత్రి

ఇ 1, 2, 3 భాగములుగల ఒకే క్యాలికో బైండు చక్కని గ్లేజు కాగితముమీద ముద్రింపబడినది

వెల రు. **5—0—0** పోస్టేజి ప్రత్యేకము.

శిస్తులు, శెస్సులు, ఎలక్ట్రిక్ పన్నులు, జీతములు, అద్దెలు గుణించుటకు ముఖ్యముగా ఉపయోగించును. గ్రామకరణములకు, రివిన్యూ ఆఫీసరులకు ఎలక్ట్రికల్ ఉద్యోగులకు, ప్లీడర్లకు, తదితరులకు చాలా అవసరము.

**మొదటిభాగము:—** ఈ "జంత్రి" అన్నిభూములపైన వివిధములగు రేట్ల ప్రకారము కట్టబడియుండే శిస్తును యకు 1కి 1 అణా మొదలుకొని రు. 5-0-0 వరకును వరుసగా గలరేట్లలో ఎట్టిసఖ్యకు అనగా ప్రతి అణాకు 1 శెంటు మొదలు 100 శెంట్లవరకును, 1 యకరా మొదలు 25 యకరములవరకును;

రు. 5-2-0 మొదలు రు. 10 ల వరకును, గల రేట్లను ప్రతి 2 అణాలకు 1 శెంటు మొదలుకొని 100 శెంట్ల వరకును 1 యకరా మొదలుకొని 25 యకరముల వరకును.

రు. 10 లు మొదలుకొని రు. 60 ల వరకు గల రేట్లలో 1 శెంటు మొదలుకొని 100 శెంట్ల వరకును, 1 యకరా మొదలుకొని 20 యకరముల వరకును గల రేట్లను సులభముగ దెలుపును.

**రెండవభాగము:—** ఈ జంత్రి 1/16 యూనిట్ మొదలుకొని 1000 యూనిట్లవరకు, యూనిట్ 1కి 0-0-1 మొదలుకొని రు. 1-0-0 వరకును, లోకల్ ఫండు, మేరఫండు, మొదలయిన పన్నులను, యూనారిక్విడ్రెంటు వగయిరా పన్నులను, పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు వారిరేట్లను గుణించుటకు మిక్కిలి యుపయోగముగ నున్నది.

**మూడవభాగము:—** నెల 1కి రు. 0-4-0 మొదలు రు. 325 ల వరకుగల సంఖ్యలకు 28, 29, 30, 31 తేదీలలో ఏ నెలలో ఎన్ని రోజులకును పైరేట్లతో కావలసిన జీతములు అద్దెలు, పింఛనులు వగైరాలు సులభముగ కనుగొను మార్గమును దెలుపును.

అడ్వాన్సు లేని ఆర్డర్లు పంపబడవు. రు. 5-10-0 మనీయార్డరుద్వారా పంపిన పుస్తకము రిజిష్టరు పోస్టుద్వారా పంపబడును.

పుస్తకములు దొరకుచోటు :

## మారుతిరామా అండ్ కో., విజయవాడ.

Approved by the T. B. C. Madras
Con. List Page 33 Part II, 22—5—51 P. No. 131

# ఆంధ్రతేజము

గ్రంథకర్త:

పువ్వాడ శేషగిరిరావు, బి. ఒ. ఎల్.

ఆంధ్రోపన్యాసకులు, మహారాజావారి కళాశాల,

విజయనగరము

1951

ప్రకాశకులు:

మారుతిరామా అండ్ కో., విజయవాడ

విద్యావిషయక ప్రచారకులు

# తొలి పలుకు

విద్యార్థులారా!

మీరీ తేజము నలవఱచుకొన సనువై యున్నది.

తొలి నాలుగు కథలును 'ఆంధ్ర తేజము' నఁబాలుపంచుకొన్నవే! కానిమఱొక్క పాత్ర మునకుద్దేశించి రచించిన పద్మినికథనుగూడఁ బ్రకాశకులిందు చిట్ట చివర పొందుపఱచి యున్నారలు.

మీరీ తేజమునుఁ జేదివ్వెగాఁ గొనినడచు కొనినప్పుడ యీకృషి ఫలవంతము.

గ్రంథకర్త

# విషయసూచిక

ఓమ్

# ఆంధ్రతేజము

## తిక్కన

### 1

చక్రవర్తి సౌధవీధుల నొక్కయందలము సాగుచుం
డెను. వేదఘోష గావించుచు గొందఱు వటువులు ముందఱ
నడచుచుండిరి, ఆ యీ వైపుల మఱికొందఱు శిష్యులు కావ్య
శ్లోకములను నందలములోని మహాత్మునకు వినిపించుచుండిరి.
వెనుక మఱికొందరు వ్యాకరణ సూత్రములు పూర్వ పక్ష
సిద్ధాంతములు సేయుచుండిరి. మేడలపైనుండి కాంతాజన
ములు వింతపడి చూడదొడగిరి. ఒక్కింతసేపటికి నందలయును
శిష్యబృందమును గోటసింహద్వారమున బ్రవేశించి పహారాలు
దాటసాగెను. అడిగిన ద్వారపాలకులకెల్ల నొక్క శిష్యుడు
గణపతిదేవ చక్రవర్తి ముద్రగల కాగితమును మాత్రము
జూపించుచుం బోవుచుండెను. ఎకాయెకి సభాద్వారము వజ్జ
కరిగి యందలమాగెను.

సభ తీర్చియున్న చక్రవర్తి ఫణిహారివలన నిది తెలిసి
కొనెను. వెంటనే రాజరిగి యందలమునుండి దిగిన కవి
బ్రహ్మకు చిఱునగవుల తెలికాంతులతో నివ్వాళిపట్టి సభ
లోనికి గైకొనిపోయెను. కవి బ్రహ్మ కాళ్ళ కాంతి బంగరు
పావకోళ్ళపై గుదురుకొని వన్నె వెట్టుచుండెను. రాజరాజు
ముందునుం దాను వెనుకనునై సోమయాజి సభామంటపమును
బ్రవేశించెను. ఆస్థాన పండితుల నడుమ నా కవిపుంగవుస

కున్న తాసన మేర్పరుపబడెను. అందతఁడాసీనుఁడయ్యెను. తన చుట్టును శిష్యులు కూర్చుండిరి.

చక్రవర్తి సోమయాజి కతిథి పూజలు కావించి "కవి బ్రహ్మ యెక్కడ? మావంటివారల యాస్థాన మెక్కడ? ఈ వింతకు గారణమేమి?" అని ప్రస్తావించెను. "అవును, రాజుల తోనే కవిరాజులకు బని. వీరు లేనిది మేము లేముకదా? మనమీ కారణమున పరస్పరము బాదుగులము. కవిత మనకు మధ్యవర్తి. ఆ కవితను వినుటకే నారాక" అని యుభయ కవి మిత్రుఁడు పలికి మిన్నకుండెను. గణపతి దేవుడు తన పండితుల దెస తిరిగి "ఈ మహాకవి కావ్య వినోదము నీయబోలు. సావధానులు గండు" అని వచించెను. వెంటనే తిక్కన యందుకొని "నా రచించిన దితిహాసము. ఆంధ్ర మహాభారతము. దేవరవారు వినఁదగినదియ. దీని విసికి కొక్క మాసమైనఁ బట్టవచ్చు. తమ రాచరికపు బనుల కిది చెఱుపు కాదుగద!" యని నేరుపు తేఁటబలికెను.

"ఆహా! భారతేతిహాసమా! తప్పక వినదగినదియ" అని చక్రవర్తి యుప్పొంగెను. చందన తాంబూల మధుపర్కాది సంభావనలుగావించి గణపతి దేవచక్రవర్తి భారతమునుజదువ గోరెను. తిక్కన సోమయాజి తోడనే లేచి సభాసదులకు నమస్కరించి కూరుచుండెను. శిష్యుఁడొక్కరుఁడు తాటి యాకుల పొత్తమును సోమయాజి చేతి కందిచ్చెను.

అతఁడు "శ్రీయన గౌరినా బరగు చెల్వకు" అని యిష్ట దేవతా ప్రార్థనాదులు గావించెను. "విరటుని కొలువులోని

పాండవుల యజ్ఞాతవాసకథ యిందున్నది. ఇది చతుర్థ పర్వము. ఊర్జిత కథోపేతము" అని వచించి విరాటపర్వము చదువుట ప్రారంభించెను. నాఁడు విరాటపర్వము ముగిసెను. నాఁటి కొలువంతటితోసరి. దినమునకొక పర్వముగా నడచుచుండెను. పండితులు, కవులు, విమర్శకులు, నానాటికి సంఖ్య పెరిగి కొలువు నలంకరించుచువచ్చిరి. ఒక పర్వము తరువాత నింకొక పర్వముగా భారతమంతయు పూర్తియయ్యెను. విన్న వారెల్లరును నొడలు తెలియని యానందమున దూగుచుండిరి.

"ఔరా! తిక్కన యెంతటి రాజకీయవేత్త! యుద్ధము పట్టులం దీయన నిక్కముగ క్షత్రియుఁడైనాఁడు" అని మంత్రులు వెఱగుపడిరి.

"ఆ! ఏమి భారతము. ఇరువది వేల పద్యములట! ఒక్కకవి, ఒక్కమొగి, ఒక్కచేత, రచించుటయా! నిజముగ నితఁడు కవిబ్రహ్మ" అని యొక కొందఱు కవులు పలికిరి.

"ఉభయ భాషలును నీయన చేతిలో దీర్పుపొందినవి ఆపదముల కూర్పు, ఆ పాత్రల నేర్పు, కావ్యశిల్పమున కెంత శాంతి పెనుచుచున్నవి. అందుననే యా ముఖమున నా తేజస్సు" అని మఱికొందఱు విమర్శకుల పొగడ్త.

"తెలుగు శబ్దములకింత శక్తి యున్నదని నేఁడు తెలిసినది. సంస్కృతమునకీ తెలుఁగులోని తీయతీపి, నుడికారము లేవనిపించినాఁడీ మహాకవి" అని గొందఱు పండితులు మెచ్చుకొనిరి.

ఈయన సోమయాజి కాకపూర్వమే రచించి మనుమ సిద్ధి కంకితమిచ్చిన నిర్వచనోత్తర రామాయణమును నేను వింటిని. దానికి భారతముపాటి సంస్కారమున్నట్లుతోచదు నిక్కముగ నీయన ప్రతిభ భారత రచనతో గోటికెక్కినది. ఇంక నీ యుగ కవులకెల్ల నీ భారతభిక్షయే బ్రతుకు తెరువు" అనియొక పూర్వపరిచయుడు క్రొత్తవారికి దెలుపదొడగెను.

కాని యెంతటి మహాకవికేని ప్రతిఘటనము తప్పదు. అందునను జాతివైరము, జ్ఞాతివైరము నీ రెండును మఱియు దప్పనివిగదా! సభలోని బౌద్ధ పండితులు భారతములోని వైదిక సిద్ధాంతములపై దండెత్తిరి. భారతము పంచమ వేదమని యచ్చట సిద్ధాంతీకరించుట తిక్కనపని. దినములు గడచెను, వారములు నడచెను. వాదోపవాదములుముగియు సరికి మాసములుదొరలెను. "తిక్కనవాక్కులో బృహస్పతి నిలచెను" యని గణపతిదేవు డచ్చెరువందెను. కవిబ్రహ్మ గెలిచెను.

"ఎంత పోరబడితిమి. బౌద్ధ శాసనములే మతధర్మములలో మిన్నలని మా మూఢభక్తి. మేము నేటివరకు దైవము దెసదొసగు కావించితిమి. మంత్రులారా! ఇక మాకొక్క బౌద్ధదేవాలయమైన గానరాదు. ఆస్థలములందు హరిహర దేవాలయములు నెలకొల్పుడు. ఇది మా శాసనము" అని గణపతిదేవుడు వ్రాకుచ్చెను. తిక్కన కెరగి"తమరు మానవ మాత్రులుకారు. తమశక్తి యమానుషము. ఈ భారతమందులకు దార్కాణ. మీ యిచ్చవచ్చిన యెనిమి దగ్రహారము

లిత్తుము. కైకొండు. ఇది చందురున కొక్క నూలుపోగు" అని వినయమున బలికెను.

తోడనే తిక్కన లేచెను. కాని యాయన మోమున బ్రసాదగుణము కనుపింపలేదు. ఆ చిన్నెలు చూచి ప్రజలు నానావిధములఁ దలఁపసాగిరి. "ఇట్టి యమానుషశక్తి కీబహూకృతి యొక్క ప్రతికృతియా" యని తిక్కన భావించి ఖిన్నుఁడై నాఁడని కొందఱనుకొనిరి.

"వేదాంతమున గొట్టకొన కరిగిన తిక్కన యగ్రహారము లాసించునా?" యని మఱికొందఱు వచింపసాగిరి.

తిక్కనమనీషిముఖబింబము మఱిమఱి ముకుళితమయ్యెను. ఆ మహాత్మునకు నోటమాట రాలేదు. బహుప్రయత్నముల నొక్కింత పలుకఁజొచ్చినను, గంఠమున గద్గదికస్వరము వెలువడసాగెను. "మహారాజా! మాకగ్రహారము లెందులకు? వచ్చిన పని వేఱు. మీ సామంత నరపాలురలో దొలివేలు మడచి చెప్పఁదగిన భూకాంతుఁడై, నాప్రాణమునకు బ్రాణమై, తా బొడమినది సూర్యుని వంశమునందయ్యు, బుడమికెల్ల చల్లని చందురుఁడై, వేసివేయక బ్రతికినధర్మమూర్తిని, మనుమసిద్ధిని రాజ్యలక్ష్మి చిన్నచూపు చూచినది. విధిప్రేరణచే నక్కన బయ్యనలు మహాబలులై దాడివిడిసి నెల్లూరును గైవసము గావించుకొనిరి. గణపతిదేవభూపా! మీకనుసన్నతో సామంతు లుద్భవింతురు మీ కనుమూతతో సామంతులు గతింతురు. మీ చేతిలాపు ధర్మరక్షణకు, మీ కరవాల మధర్మ శిక్షణకు. అధర్మ మిప్పు డడుగు పెట్టినది. ధర్మమునకు నిలుకడ తప్పినది.

ఇప్పుడునా మనసు పగులువారినది. నాభారతము దెసమూలినది. నా ప్రతిభ అనాథమైనది. ఇది శోచనీయము. నాకు మీరు నూఱువేలగ్రహారములు కురిపించినట్టుల; మా మహారాజు నకు మాకీర్తిమూర్తికి, మాధర్మనేతకు, రాజ్యమిప్పింపుడు; ధర్మము సముద్ధరింపుడు" అని తిక్కన హృదయముముట్టబలికెను. కవీశ్వరుని పలుకులు సభాసదుల గుండియలు కరఁగించి పాఱింపజొచ్చెను. గణపతి దేవుని మేనెల్ల గగుర్పాటుచెందిచలించెను. మహారాజు ప్రాంజలియై "మహాత్మా! మీరు మహాకవులు మాత్రమేకారు. మహామంత్రులు కూడను. మీరుధర్మప్రవక్తలుమాత్రమెకారు.ధర్మసంస్థాపకులుకూడను మీవాక్కున శబ్ద ప్రపంచము, మీకరమున గంటము, మాత్రమేకాదు; శరపరంపర శస్త్రాస్త్రములు జత జేరినవి. ఆనందము. నాకొఱకు పరమార్థము గఱపినారలు. నేటికి సభ చాలింతము. ఱేపేసంగరము.సూర్యోదయానంతరముప్రయాణము. మహామంత్రులెల్ల రణమునకు వలయుసామగ్రి నేమఱక సమకూర్పవలయు" అని గణపతిదేవుడు చివాలున లేచెను. కవిబ్రహ్మ యథాప్రకార మందలము నెక్కి మహారాజునకు విందై చనియె.

## II

ఱేయి కడచినది. తెల్లవారినది. ప్రొద్దెక్కినది. అరదములో గణపతి దేవుని చెంత తిక్కనకవిరెడ్డిగము వైచుకొని కూర్చుండి యుండెను. రణప్రయాణమునకై భేరిమ్రోగెను. చక్రవర్తి యరదము కదలెను. మందుసామగ్రి, భోజనపదా

ర్ధాదులు, నెల్లయుం దరలెను. చతురంగ బలములుచక్రవర్తి రథమునకు మునువెనుకలను, చుట్టుప్రక్కలను బలసి చనుదేర సాగెను. అదిరణయానము కాదు. పెండ్లి తరలిపోక. నాడు మార్గమందలి వెలనాడునందు రాజరాజు సేనలు విడియించి, యారాజు నోడించి, కప్పములనప్పనమునొందెను. అటనుండి తిరిగి సేనలకొని నెల్లూరి మొగమై చక్రవర్తితరలజొచ్చెను.

మరుసటి దినము సూర్యోదయమగుసరికి కోటకేవైపు జూచినను సేనాప్రవాహమే. నెల్లూరిలో నేమేడఁ జూచినను నగ్నిహోత్ర ప్రీతియే, కోటచుట్టును గొలదియిడరాని సేనా తరంగములుబురుజులపైకెగబ్రాకజొచ్చినవి.అక్కన బయ్యన లంతిపురమునుండి చూచిరి. వారికిది తలవని తలంపు. వారి గుండియ లవిసిపోయినవి. వారి మంత్రులును నొక్కసారిగా నిదిచూచి విస్మయము నెందిరి. రణమా రాజరాజుతో! అయినను నోపినంత దనుక కోట రక్షించుకొనక తప్పదు; రణమున కవతరింపక తప్పదు.

తుదకు సపరివారులై యక్కన బయ్యనలుయుద్ధమున కుపక్రమించిరి. అదిఘోర రణము. ఇరు తెగల సేనలునుఁ బోరాడినవి. జననాశము, ధనవ్యయము అక్కన బయ్యనల పాలైె దిగ్విజయము, ఆనందము, గణపతికిదక్కినవి. ధర్మము గెలిచెను. అధర్మమునశించెను అక్కన బయ్యన లరణ్యములువట్టిరి. ఇఁక తిక్కనకు గట్టబగ్గములు చాలకుండెను.

చక్రవర్తి పురజనుల జయధ్వనుల మధ్య సభామంట పమునసాసీనుఁడయ్యెను. ఒకప్రక్క దిక్కనయు నొక్కవైపు

మనుమసిద్ధియు గూర్చుండియుండిరి. గణపతిదేవుడు తిక్కన మనీషివంక చిరునవ్వుతోఁ జూడసాగెను. మహాకవి పొడవున మఱింతయయ్యెను. మనుమసిద్ధికి మాత్రము పొడసూపిన యానందము సిగ్గులో మునిగిపోయెను. గణపతిదేవమహారాజు చేతిలోని కిరీటము నవరత్న కాంతులీనిన కొలఁది, తిక్కన మహాకవి కరతలమందలి తాళపత్రసంపుటము నవరసరభరితమై తేజము చిమ్ముచుండెను.

“మనుమసిద్ధిరాజా” యని గణపతిదేవుఁడు పలికెను “జామాతా! యని తిక్కన సంబోధించెను. ‘నీధర్మమే నిన్ను రక్షించినది. కాదు ఈమహాకవియే నీత్రాత’ యనిచక్రవర్తి తిక్కనవైపు వేలుచూపెను. తోడనే కవిబ్రహ్మ ‘అదికాదు, గణపతిదేవ చక్రవర్తి మన కర్త త్రాత; లేదేని ఇదిగో మహాభారతము, ఇది” అని పలికి మనుమసిద్ధి చేతిలో హరిహరాంకితమైన యాంధ్రమహాభారతము నుంచెను.

అంత గణపతిదేవుడు “ఇది నిక్కము. తిక్కనమహాకవి భారత మాబిరుదమును మోయతగినది. కవుల రచనలు సామ్రాజ్యము లార్జించుటలో నిదియే మొదటి తార్కాణ. తిక్కన కవిబ్రహ్మయె కాదు అపరబ్రహ్మ” అని పలికెను. మనుమసిద్ధి దిక్కై గణపతిదేవుడు తన చేతిలోని కిరీటమును మనుమసిద్ధి నృపాలుని శిరమున నిలిపెను. నిలిపి, రాజరాజు కవిరాజునుఁజూచి “తిక్కనామాత్య! నాడు వాగ్దాన మొనరించిన యగ్రహారము లెనిమిదియు దమ కప్పుడే దత్తము.

“పోతనామాత్యునకు మన ‘తాఖీ’ దందినదా?” యని రాజడిగెను. “ఆ! అందినది. వారీ సభ కరుదెంచిరికూడను” అని సచివు డుత్తరమిచ్చెను.

‘ఏరీ!’ అని రాజు తన దృష్టిని పండితుల వంకకుఁ ద్రిప్పెను. వయసుప్రాలిన యొకానొక కవీంద్రుడు పండితుల నడుమనుండి లేచి నిలువబడెను. ఆయన తలయెల్ల తిలతండులములవలె తెల్లతెల్లనైయుండెను. శరీరమెల్ల ముడుతలు వడ్డ నరములప్రోగే! కాని ముఖమున మాత్రము బ్రహ్మతేజస్సు మోకాళ్ళ దిగఁదిగని గోరంచు చినుఁగుల కొల్లాయి ముడులలో నాయన తన పేదరికము నెల్ల దాఁచికొని యుండెను. కాని యాయనఫాలభాగముమాత్రమితఁడుమహాభోగియో, మహాయోగియో, యని భ్రమగొలుపుచుండెను.

రాజు—సహజ కవితా దురంధరులకు నమస్సు. తమ రాకచే నేడీసభ ధన్యత కైసేసిన దనవచ్చును. అనుగ్రహింపబడ కోరుదుము.

పో—శీఘ్రమే హరి కరుణించు గాక!

రాజు—మహా ప్రసాదము. నేఁడే యన నేల! భోగినీ దండకమును మేము కృతినందిననాటినుండియును దమ దీవనయ శ్రీరామరక్ష.

పో—ఆ గ్రంథకారణమున మీకన్న మీ వేశ్య చిరస్థాయిని యైనది. కాని తద్గ్రంథరచనతోను, నయ్యది మీ కంకితము సేయుటతోను, కవిమాత్రము పాపమునే మూట గట్టుకొనియెను.

రా—మహాత్మా! అందువనే మా మనస్సు పరివర్తనము నొందినది. భగవచ్చరిత్రములు తప్ప వేఱుకృతులంకితము గొంటకు మా కిప్పు డిచ్ఛయే జనింపదు.

పో—అవును. హరిచరిత్రలే యానందదాయకములు. అందే ముక్తి నెలకొన్నది.

రా—తమ రిప్పు డొక యుద్గ్రంథము రచించుచున్నారటగద.

పో—నేనెవఁడను రచించుటకు? అది శారదావిలసితము.

రా—అట్లే యందురు. మీా రద్దానిని శారదచే బలికించు చున్నారని వినికిడి.

పో—అదియు నబద్ధము. పలికించెడువాడు రామభద్రుండఁట.

రా—పోనిండు దాని నామకరణ మేమి?

పో—భగవంతుడు నామరూపరహితుఁడు కదా!

రా—అది యట్టిద. కాని వానిని భగవంతుడని యందుమా లేదా?

పో—అందుము. అట్లే దీనినిగూడ భాగవత మనుఁడు.

రా—వ్యాసరచిత పురాణములోని సంస్కృత భాగవతమున కిది తెనుఁగు సేతయా!

పో—అచ్చపు దెనుఁగు సేత యనఁ జనదు. దాదా పనుసరణ యనవలె.

రా—అందలి భాగము లెన్ని?

పో—ద్వాదశ స్కంధములు.

రా—అది సాంతమైనదా?

పో—భాగవతమున కంత మెక్కడ? అనంతశయనుం డనం

తుఁడు కదా! వాని చరితము ననంతము.

రా—నిజము నిజము. పాప మట్టి యఖండ చరితమురచించు టొక్కయెత్తును, దాని బ్రకటించు టొక్కయెత్తును.

పో—రచించినవాఁడె ప్రకటించును. అది నేనా? ఇది నే నగుటకు.

రా— గ్రంథకర్త ప్రకటనకర్త కానోపుట కష్టముగద! ధనము నధికారము నందుల కవసరములు.

పో—రాజా ఒక్క ధనాధికారము లననేల? సర్వాధికారములు గలవానికే యది చెల్లును.

రా—నేఁ దెలుపునదియు నదియ. అట్టియులే దానికష్టములు. ఎంతటి మహాకవికైన నా సామర్థ్యములు సాధారణముగ గలుగనోపవు, చక్రవర్తులకు చెల్లు. అదియు నరిది.

పో—వారికైన నెట్లు కలుగును? సర్వజ్ఞునకే యది తగును,

మంత్రి-[అందికొని] దేవరవా రనునదియు నదియే. రాజుల కది పరిపాటి. అందును మీరాడు సెలవిచ్చినటుల సర్వజ్ఞ సింగభూపాలునకే మఱియుం దగును. వీరి వైదుష్యము మీకెఱుకయ, వీరి పోషణమున కాస్థానపండితాదరణమే నిదర్శనము. కాన వీరి కా గ్రంథరాజ మంకిత మిచ్చి చరితార్థులుగండు. తొల్లి దండకము తేనికంకితమిచ్చిన మీకధికముగ జెప్ప ననవసరము. పడ్డచోటనే వెదకికోలు మంచిది. క్రొత్తలు తడవనేల!

రాజు—మహాకవీ, స్వాగతము! ఈయాభరణ తాంబూలము లందికొనుము. సచివాగ్రణీ! కోరినన్ని యగ్రహారము లీ మహాకవికి వ్రాసి యిమ్ము.

మంత్రి—కవీంద్రా! సెలవిండు. ఏవి కావలయును? ఎన్నివలయును?

పో—నిష్కామ కర్మలకు కామ్యము లెక్కడ?

రాజు—అయ్యో వెఱ్ఱితనము. ఏ కవీంద్రుఁడు నిష్కాముడై బ్రతికెను! సంస్కృత కవుల నటుంచుము. ఆంధ్ర కవుల నెంచిచూడుము. రాజనరేంద్రుని యాపితో కదా నన్నయగారి జీవన సౌభాగ్యము. మనుమసిద్ధి యాశ్రయముతోగదా తిక్కన్నగారి యగ్రహార సంపాదనము. అనవేమా రెడ్డి యాస్థానమునగదా ఎఱ్ఱనగారి లెస్సబ్రదుకు. మహారాజుల యాశ్రయము ననే కవులు మహాకవులగుట. మహాభోగులగుటయు నందుననే! మీ రేల యగ్రహారము లడుగరాదు? అడిగినన్ని యిత్తు మంటిమికదా!

మంత్రి—మహారాజా! వారు కోర నిచ్ఛగింపరేమో? తమ రిచ్చినన్ని గైకొని సంతసింతురు కావలయును.

రా—అట్లయిన సరియె కవీంద్రా? "శుభస్య శీఘ్రం" రేపు మంచిదినము; నక్షత్రమును మంచిది. తమగ్రంథమును దెచ్చి రేపే మమ్ము కృతార్థు గావింపుఁడు. తమకు పదునే నగ్రహారము లీయ దలపుపుట్టుచున్నది.

అవి స్వీకరింప బ్రార్ధన. ఇదిగో నేటి కేయూరభరణా దులు కైసేసి దయచేయుడు.

పో— "కేయూరాణి నభూషయంతి పురుషం" ఈ భూషలు నాకలంకారములా? మఱియు, ఇపటిదనుక నేల! ఇదిగో యిపుడే యంకితముగావించి చనియెదను.

రాజు—అగుచో గ్రంథము దెచ్చిన బాగుగనుండును. ఎవ డురా! అక్కడ? పోతనామాత్యుల యింటికేగి వారి మాటగా దెలిపి భాగవతమును గొనిదెండు.

పో— అవసరము లేదు. అదియునుంగాక భాగవతమన్న చా నిచ్చటను నచ్చటను దొరుకునది యూ! "అల వైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధమ్ము దాపల" నున్నది. అది మీకు లభించునా?

రా—అది నిజము; కాని యదిమీ తాటియాకు పాకలో గుదు రు కొన్నదిగదా! సచివాగ్రణీ! పండితుల యాశీస్సు లును, వాద్యముల మంగళ ధ్వనులును, నొక్క మొగి యిట మాఱు మోగ నాజ్ఞయిమ్ము. పోతనా మాత్యా! ఏది? సెలవిండు.

పోతన—ఉ|| ఇమ్మనుజేశ్వరాధముల ♦ కిచ్చి పురంబులు వాహనంబులున్

సొమ్ములు గొన్నిపుచ్చుకొని ♦ చొక్కి శరీరము వాసి కాలుచే సమ్మెట వాటులంబడక సమ్మతి ♦ శ్రీహరి కిచ్చి చెప్పె నీ బమ్మెర పోతరా జొకడు ♦ భాగవతంబు జగద్ధితంబుగన్.

అని చదివి "ఇక సెలవు గైకొందు" నని పోతన బయలు దేఱెను. సభయెల్ల నుడికిపోవుచుండెను. "ఇది యేమి కర్మము, పోతనను ఱేఁ డేమి చేయునో? పాప మీ బక్క బాపనయ్య గతి యేమగునో" యని జాలిపడు వారు కొందరు. "ఏమియు గాదు. బ్రహ్మ తేజమున కెదు రేది? అది రేగనే రేగదు. రేగిన నార్చువా రెవరు?" అని ధైర్యము చెప్పుకొనువారు కొందఱు. ఇట్లాడికొనుచు సభయెల్ల ఱేని వంక దృక్కులు పఱపెను.

రాజునకు కనుబొమలలో ముడులు బయలుదేఱెను. కనుగొనలనుండి యగ్నికణములు చెఱఁగఁబడెను. "ఎవఁడురా! అక్కడ!" అని పిడుగఱచిన క్రియ రాజు బొబ్బ పెట్టి "పోనీ యకుఁడు, పట్టుకొనుఁడు" అని ముదల యిచ్చెను. పోతన గిరుక్కున వెనుకకు మరలి 'నన్ను బట్టుటకు వీ రెందులకు? నే నే వత్తును. అని తిరిగి యథాస్థానమునకరిగి కూరుచుండెను.

పండితు లెల్లరు చుట్టును మూఁగిరి. 'అయ్యో పిచ్చి బ్రాహ్మణుడా, వ్యర్థముగా రాజు నలయించితివి. అనేకము లగు నగ్రహారములను గోలుపోయితివి. దేనికేని అదృష్ట ముండ వలెను అన్న పండితులు కొందఱు. "మాకన్న నీ వేమి దిగివచ్చితివా యేమి? ప్రపంచ నటనకు ధనము ప్రధా నము. తిండియేని లేక నిలువు నీఱగుదువా? యన్న పండి తులు కొందఱు. "జరిగిన దేమో జరిగినది ఱేని శరణము నుము. అంకితమును మీకే యిత్తుననుము మించిపోలేదు. వారు మన్నింతురు. వారికి భాగవతము గొంటయందుఁ

జూడక్క తప్పు నీపై గసియుండదు. లెమ్ము, శాంతపడుము” అని కొందఱు పండిత వృద్ధులు పోతన్నను లేవదీయుచుండిరి కాని యతఁడు మరింత బరువయ్యెను. ఆయన మోమున నాతురత లేదు. నిశ్చలముగ నుండెను. ఆయన మనసు కలత చెందలేదు. నిర్మలముగ నుండెను. “నన్నూరక బాధింపకుఁడు. మీకొక వందనము” అని యతడు మిన్నకుండెను. ఇంతలో రాజాజ్ఞ నిర్వర్తించుటకై దండనాథకారులు వచ్చి పోతన్న కిరువయిపుల నిలువబడి రాజునంక జూచుచుండిరి.

తోడనే మంత్రి నిలువబడి “కవీంద్రా మీ గ్రంథమును శ్రీవారికి నంకితము నీయకుంట ద్రోహము కానేరదు. అది మీ యిచ్ఛ ననుసరించు విషయము. కాని రాజదూషణము సేసినారలు. దానికి మీరుత్తరవాదులు. ఏమి చెప్పకొనెదరు?

పో—ఆ దూషణ వాక్య మెయ్యది?

మం—ఇమ్మనుజేశ్వరాధములు అన్న పలుకు.

పో—అం దబద్ధమేమి? సింగభూపుడే యననేల! ఎల్లరాజులు నట్టిర! అందును సింగమహీశుఁడు తప్పక యట్టిఁడే! ఉంపుడుకత్తెపై కబ్బము రచించుకొని కృతిగొన్న వాఁడెట్టిఁడు? అరయుమిచే నేనును నా దురితమున బాలుపంచికొని యుంటిని. మానవాంకితము మహాపాపకరము, అందును వేశ్యచరిత్ర. దాని నిష్కృతికై నాకీ మహాభాగవత రచనము చాలదు. అట్టిచో నీ భాగవతమునుగూడ మరల నరాంకితముసేసి కళంకి

తము సల్పుదునా?

రాజు—అవును కళంకితము సేయుటేల? శిథిలము నే సేయించుకొనుము.

అని రాజు దద్దరిల బలికెను. దండనాయకులారా! వీని నిచ్చటనే బంధింపుడు. సైన్యపాలై పొండు. వీని కుటీరమును జుట్టుముట్టుడు. భాగవతమును గొనితెండు. పుడమిలోఁ బూడ్పించెదను. ఎట్లుప్రకటనకు వచ్చునో చూతము” అని పలికెను. తోడనే పోతనను బంధించి దండనాథులు సపరివారులై చనిరి. ఒకింతలోనే యామహావీరులు ఆంధ్ర మహాభాగవత తాళపత్రములశకటమున బేర్చి తెచ్చిరి. రాజు మంత్రిచెవిలో నేదియో యూదెను. ఆ పత్రములు కొని మంత్రిసత్తముఁ డరిగెను. నాటి సభ ముగిసెను. పోతనను విడిచిపుచ్చి రాజు మందిరమున కరిగెను.

II

పోతన విడుదల పొంది చనినది మొదలు, రాజు మరల సభాభవనమువంకఁ జూచియుండలేదు. సర్వజ్ఞుఁడు వ్యాధియు, నాధియు లేకయే దినదిన క్రిమమునఁ గృశింపఁదొడగెను. తేయింబవళ్ళు నిద్రపట్టదు. ఒకింతసేపు కునికినను దాళపత్రముల కట్టలే తనకు సాక్షాత్కరించుచుండెను. ఈ వార్త ప్రజకు ప్రాకినది. దలకొక్క తలఁపుగా నింటింట రాజుగారి వ్యాధినిగూర్చి విమర్శనలే. “రామ భక్తుడైన పోతనగారి వృత్తాంత మీ వ్యాధికిఁ ప్రబల కారణ” మని పెద్దలు చెప్పుకొనుచుండిరి.

ఒకనాటిరేయి సర్వజ్ఞుని సతీమణి నిద్దురనుండి కలవర
పడి లేచెను. నిద్దురయే పట్టక యామమొక్క యుగముగఁ
గడపుచున్న సర్వజ్ఞుఁడు సతీమణిని శాంతపఱచి కలవరపా
టునకు కారణమేమని ప్రశ్నించెను. ఆమె యిట్లు తెలిపెను.
"నాకు కలలో శ్రీరాముఁడు ప్రత్యక్షమై నన్నును నా
భక్తుడగు పోతన్నను పరిభవించి నీ భర్తవంశనాశనమున
కెత్తినాఁడని పలికి యదృశ్యుఁడయ్యెను. రామచంద్రమూర్తి
పోతన కనుసన్నలలో వెలుగుచున్నాఁడు మీరు సర్వజ్ఞులు.
మీకెఱుక లేని విషయములేదు. ఎఱిఁగియు మీరుతొందరపడి
తిరి. విధివ్రాలు బలవత్తరము. మనకేమి ముప్పురానున్నదో?
భారతీ దేవిని నరాంకితము సేయక కాపాడుట పోతనవంటి
వానికి విహితధర్మము అతఁడది కావించినాడు. అతనితప్పేము
న్నది! మీరట్టి మహాత్ముని నలయించుటొక్కతప్పు. భగవత్
చరిత్రమును బాతివేయించుట మఱొకటి తప్పు. మీపాండి
త్యమే మీ పండిత పోషణయే మీ కిహ పర సాధకములై
యుండ మీరీ రెంటికిని దూరగులు కావలసివచ్చినది. పోతన
సందర్భమున నిహము చెడినది. భాగవతాపకారమున
బరము మాసినది. ఇహపరములు లేని జీవనము మీ వంటి
ప్రతిభావంతులకు దగనిది. మంత్రిసత్తముని బిలిపింపుడు.
భాగవతమును వెలికి దీయింపుడు. రామచంద్రుఁడు దయా
సాగరుఁడు. తమవంటి ప్రాజ్ఞుల మన్నింపక పోఁడు."

అని బహువిధముల బలికిన సతీమణి పలుకులు సర్వ
జ్ఞుఁడు కొయ్యబారి యాలించెను. ఆయన మనస్సు పరివర్త

నము చెం దెను. "నీవు నా కిప్పుడు సతీమణివి కావు. ఉప దేశకురాలవు. నా హృదయమునుఁ గలక దేర్చి నిర్మలము గావించిన యపరశ క్తివి" అని సర్వజ్ఞుఁడు తన్మయుఁడై పలికె ఎవడురా! అక్కడ! మహామంత్రిని గొనిరమ్ము" అని యాజ్ఞాపించెను. శ్రీరామ ధ్యానముతో నా దంపతులు తెల్ల వాఱుదనుక నట్లే కూర్చుండిరి.

... ... ... ...

సూర్యోదయమగుసరికి పోతనగారి తాటియాకుల పాక రాజపరివారముతోఁ గలకలలాడుచుండెను. ఒకప్పుడుబలవం తముగఁ గుటీరపు దడికలు చీల్చి లోనికిఁ బ్రవేశించి "ఏదీ భాగవతము?" అని యఱచిన సేవకులే యంతంతన వంగి "సహజకవితాధురీణులకుజయము. ఆంధ్రమహాభాగవతమున కభ్యుదయము!" - అని యెలుగెత్తి పలుకదొడగిరి. కుటీర రములో రామమందిరమున నిమీలిత నేత్రుఁడై యంజలి ఘటించి భగవత్ భక్తుడు దర్భాసనమునఁ గూర్చుండియుం డెను. ప్రొద్దెక్కెను. ప్రొద్దు తిరిగెను. అప్పటి కాయన యోగనిద్ర ముగించెను.

విభూతి రేఖల నడుమ గుంకుమ తీర్చిన పరమ భక్తుఁ డప్పుడు బయటికి వచ్చెను. మహామంత్రి పోతనకు నమస్క-రించెను. పరివారమెల్ల నాయుధములు నేలకు దింపిరి. చేతులు జోడించిరి. "మరల నేడేమి పనిమీద దయచేసితిరి? అని పోతన ప్రశ్నించెను. రాజు నానతి మంత్రి దెలిపెను.

పోతన కెంపు పెదవులపై నొక వెడనవ్వు తోచెను. 'రమ్మని రాజాజ్ఞయా? సంసిద్ధమ' అని పోతన బయలు దేఱెను.

పోతనయు మంత్రియు నాశీనులైరి. అరదముకదలెను. పరివార మనుగమించెను. జయధ్వనులు మాఱుమ్రోగెను. అది యఖండోత్సవము. ఊరేగింపు పూర్తియైనది.

పోతనామాత్యుఁడు సభామంటపమునకు గొనిపోబడి సింగభూపాలుని చెంత నుచితాసనమునం దునుచబడెను. మహాకవి ప్రజ్ఞ రత్న వేదికపై ఆంధ్ర మహాభాగవతము నిలుపబడెను. సింహాసనమునుండి లేచి సర్వజ్ఞుఁడు పోతనకును భాగవతమునకును బ్రదక్షిణించి నమస్కరించి కూర్చుండెను "నాచేసిన దోసమును సైరింపుడు. మహాత్మా!" యనిరాజు పలికెను. పోతన లేచి 'ఇదంతయునొక ఇంద్రజాలము. నాఁటి దూషణ నాకంటికొని నిలిచియుండను లేదు. నేటిభూషణ నాకంటునదియుఁ గాదు. అదియు నిదియు నాకొక్కరూప" మని పలికి కూర్చుండెను. రాజు పులకితుడయ్యెను పోతన దృష్టి భాగవతముపయి కరిగెను. చివికి జీర్ణించి యున్నయా తాళ పత్రమును చూచినంతనే పోతన కాపుకొనలేని దుఃఖము పొరలివచ్చెను. "నా తల్లి శారద శీర్ణ శీర్ణమై ధూళి ధూసరితమై నిలిచినదా? రత్నఖచిత వేదికపై నుని చిన మాత్రమేమి? ఈమె పొందిన రాయిడి యీమె ముఖముననే గాన్పించుచున్నది" అని లేచి పత్రములను చేతితో నిమిరి జొట జొట కన్నీటిని గార్చెను.

ఆ విచారమున సభయెల్ల పాలుపంచుకొనియెను. సింగభూపతి "మహాత్మా! మీ సరస్వతిని మీరుస్వీకరింప బ్రార్థన. మీ కారణమున నాసతీమణికి రామచంద్రుఁడు దర్శన మిచ్చియుండెను. మాజన్మ ధన్యమైనది" అనిపలికి యానందాశ్రువుల రాల్చెను. సభవారుమెచ్చుకొనిరి. పోతన రాజు నాశీర్వదించెను సభముగిసెను. మహాకవి భాగవతము వెంటగొని రథారోహణము జేసి పరివారముతో గుటీరమున కరిగెను.

దిన క్రమమున రాజు తేఱికొనెను. కాని మహాభాగవత మున్నంత వఱకు సింగభూపతి పేరుశాశ్వతము.

---

# పల్నాటిపులి

## 1

"ఆటపాటలతో నలసినావా కుమారా! అట్లగుచో చదువులెఱిగిన ధరామరుల బిలిపించి చదివించుకొని భారత భాగవత కథలు వినుము. భీష్మద్రోణుల పటిమ, కర్ణశల్యుల బాణనైపుణి, తెలిసి మనసున కెక్కించుకొనుము. దుర్యోధనుని యభిమానము నీవుకూడా పంచికొదగినది. రణరంగమున బరమాత్మవలనఁ గ్రీడికఱచిన కర్మ రహస్యములు నేర్చి నీ వాచరింపదగినవి."

అని ఐతమ్మ పలికెను. బాలచంద్రుఁడు పకపకి నవ్వెను. "అమ్మా! వేదశాస్త్రములు నేనభ్యసించినవి. భారత భాగవతములే జదివినవి. నాకిపుడు వలసినది చిత్త

విశ్రాంతి. బొంగరా లాటపైకి మనసు పరుగులు వాఱుచు
న్నది. సెలవు ననుగ్రహింపుము తల్లీ!" అని బాలు డడిగెను.

"తండ్రీ! మనమిప్పుడు వలసలోనున్నారము. దిన
ములు మంచివికావు. నీవాడునపు డాబొంగరముపోయి,
యేయంగనకైన, నేబాలునకైనఁ దగులవచ్చును. దుర్వాచ
కులు నీ మేలు చూడనోడి శపింపవచ్చును. కాన నాయాట
వలదు నాయనా!"యని తల్లి వారించెను.

కాదు కూడదని బాలచంద్రుఁడు పట్టు పట్టెను. ఐత
మ్మకు మనసు కరిగెను 'సరే' యని పనివాండ్రనుఁ బిలిపిం
చెను. కొన్ని బొంగరములు చేసి తెండని ఐతమ్మ యాజ్ఞ
నిచ్చెను. అది విని బాలుఁడు "తల్లీ! యీ లోభ గుణమేల?
మలి దేవరాజునకు మహామంత్రి మా తండ్రి. కోటీశ్వరుఁడగు
గండుకన్నమనీడు నీకు సోదరుఁడు. ఇట్టి నీవే సామాన్యపు
బొంగరములు చేయించుట కేల యొడంబడితివి? ఈ వెలితికి
నీ మన సెటొప్పినది. కలుములు కలకాల ముండునవా?
మబ్బులవోలె నవ్వి చెదరిపోవునవే. కలిమి కలనాఁడే యది
యనుభవించుటయును, ధర్మము లాచరించుటయును. అనుభ
వానంతరమే వెగటు తోఁచుట. వెగటు జనించినప్పుడుకాని
వైరాగ్యము పొడమదు. వైరాగ్యమే సంసారమును దరింప
జేయునది. అదియే పెద్దల సేవకు దారి. అప్పుడు కాని
ముక్తి కలుగదు. ఇట్టిపరిణామముగల భోగానుభవము గైకొన
వలసినదే యనుటకు సంకోచమేల? అనుభవింపని-చో నొక్క
చిన్నమైన మన వెంట వచ్చునా? కాన సొమ్ముపై మక్కువ

వదలుటయే యానందదాయకము. అని బాలచంద్రుఁడు తల్లికి దత్త్వబోధ గావించెను.

ఐతమ్మ వెంటనే యా పనివాండ్రకు బట్టెడకారులు, కమ్మచ్చులు, నీరుకార్లు, సుత్తులు, కత్తెరలు, ఉచ్చులు, గుదులు నన్నియుం గైకొని తన మందిరమునకు రా నాన తిచ్చెను. వారవి తెచ్చి యగ్ని నెలకొల్పికొని పూలతో బూజించి నైవేద్యము నిచ్చుకొనిరి. ఐతమ్మ పైడినాణెముల సంచులతోఁ బ్రవేశించి మూతులు విప్పి క్రుమ్మరించెను. అవి కైకొని వారు మూసలలో వేసి కరగింప మొదలుపెట్టిరి. బంగరు వెంతసేపు కరగినను వన్నె రాలేదు. చిందరవందరై చిన్న చిన్న చిదురుప లయ్యెను. సొన్నారు లందరును భయముచే వణకిపోయిరి. బాలచంద్రుఁడది చూచి సంకోచము పెట్టుకొనవద్దని తల్లికి ధైర్యముఁ జెప్పెను. తన చెలికాండ్రగు మంగల మాధవునకును, గుమ్మర పట్టికిని, జాకల చందునకును, వెలమ కొమరునకును, కంసాల చందునకును నెల్లరకును వెండి ములుకులతోడి బంగరు బొంగరములు వేలు వేలు చేయించి యిచ్చెను.

వంటయైనది భుజించి పొమ్మని ఐతమ్మ కొమరుని గోరెను. భోజనానంతరమున మేలిరకపు దువ్వలువలు దాల్చి, యాణిముత్తెముల సొమ్ములు బెట్టుకొని బాలచంద్రుఁడు శృంగారముగ బయలుదేరెను. రాజ వీధులందును, విపణి మార్గములందును బొంగరము లాడవద్దనియు మేడపి యుత్తర దిక్కున రావిచెట్టు క్రింద నాడుకొమ్మనియు జెప్పి

ఐతమ్మ కుమారుని నాశీర్వదించి పంపెను. బాలచంద్రుఁడును సోదరులును నందమైన పొట్టేళ్ళపై నెక్కి బయలు దేరిరి. తిత్తులు చిఱుతలు సొగటాలు గైకొని పంజరములు, పిట్టలు, డేగలు, పిగిలిపిట్టలు, చిలుకలు, గోరువంకలు వీని నన్నిటిని వెంటనుంచుకొని కొందఱు బాలచంద్రుని ననుగమించిరి. బాలచంద్రుఁడు సపరివారుఁడై రావిచెట్టునొద్దకు జేరెను.

బొంగరాలాట చూచుటకు మేడపిలోని పిల్లలు తల్లిదండ్రుల యనుమతి గైకొనకయె వచ్చి కూరుచుండిరి. పరువపుటంగన లత్త మామల నడుగకయె తమ తమ చెలికత్తియల గూర్చుకొని ముచ్చటలాడుకొనుచు నాడజూడవచ్చిరి. ఒక విప్రకాంత యా చిన్నవానియాటఁ జూచి వత్తమని వైశ్యనెలతను రమ్మని కోరెను. ఆ నెలత "బాలచంద్రుడు పున్నెము బాపము నెఱుగని దుండగీడు. పరుగెత్తు బండ్లకు చక్రముల సీలల నూడదీయునట్టి దిట్ట. అట్టివాని యాటపాటలు చూడ బోయిన ప్రమాదముగదా" అని పలికెను. అందుపై విప్రనారి నేపోయి వచ్చెదను నీవుండు"మని బయలుదేఱెను. తోడనే వైశ్యకాంత "నీ మైత్రిబాసి నే నెన్నడును నుండ లేదు. నేనును వచ్చెద పద"యని అత్తమామలకు మొక్కి వారి యనుమతి గైకొనిపోయెను.

ఈరీతి నెల్లరును పోయి రావిచెట్టు మూగి నిల్చిరి. "ఈయనయే పలనాటి బ్రహ్మనాయకుని కుమారు"డని యొక్క అమ్మలక్క బలికెను. "ఔరా! ఏమి తేజము! ఎంత శౌర్యము! ఎట్టి చక్కదనము". అని మరొక్కతె వింతబోయి పలికెను.

ఇంతలో బాలచంద్రుని యన్నయగు ననపోతు తమ్ముని జూచి 'మన తమ్ములెల్లరు కనిపెట్టుకొని యున్నారు. నీవు ముందుగా బొంగరము వదలకుండ వారు మొదలుపెట్టరు' అనగానే బాలచంద్రుడు లేచెను. సేవకులు వచ్చి జను లడ్డము రాకుండఁ బ్రక్కల కొత్తుచుండిరి. బాలచంద్రుఁడు బొంగరము చేత ధరియించెను. "పుడమికిని నాకసమునకును నడుమ బొంగరమునుపట్టి యాడించెను. చూడు" డని బాలచంద్రుఁడు ముత్యాలజాలుచుట్టి బొంగరమును లాగి విసరెను. అది రఁయి రంయి మని తిరుగజొచ్చెను. దానిని బాలచంద్రుఁడు తన యరచేతిపై కెక్కించుకొని కొంతసేపాడించెను. తదుపరి నొక్క బాణముచివర దానిని నిల్పి యాడించెను. ఇది చూచి చూపరులు విస్మితులైరి.

తిరిగి యతడు చేయెత్తి హుంకించి బొంగరమును నేలపై విసరివైచెను. అదిపోయి యాకసమున కెగసి విప్రకామినితో వచ్చిన వైశ్యకాంత మీఁగాలికి దాకెను. కోమటక్క పుడమిపై బడి మూర్ఛజెందెను. ఒక కొంతసేపటికి శీతలోపచారములచే నామె తేటికొని కన్నులు విచ్చునప్పటికి బాలచంద్రుఁడు చేతులు జోడించి ఖిన్నుఁడై నిలువబడెను. అతని మోమున విన్నబాటు గోచరించెను. అతని హృదయమున నగ్ని రగులుచుండెను. అతని మొగమున కత్తి వాటుంచినను నెత్తురుచుక్క లేదు. కాని ఆమెకు కోపము తగ్గలేదు. "ఓరీ! దుష్టబుద్ధీ! మున్ను మన్నెఱుఁగక గర్వించుచున్నావు. నీ గర్వమంతయు గొంతలపైననా? కలవాఁడ వైనచో దిన

వచ్చు కట్టుకొనవచ్చు. ఒడలు తెలియని పని చేసి ప్రాణములు
తీసెదవా? తేరగా మరి దేవరాజు సొమ్ము దిని తృప్తిపడుచు
న్నావు. మీ తండ్రులెల్ల రాజుతోపాటు యుద్ధమున కరిగి
శత్రుమర్దనము చేయుచుండగా నీ వాఁబోతువలె మేడపిలో
నాటలాడుకొనుచున్నావా?" అని కోపటి యన్నమ్మ బాలుని
దిట్టుచుండెను. అనపోతు కన్నులెఱ్ఱజేసి యామెపైకి లేచెను.
"అబలలపై కరుగవచ్చునా?" అని బాలచంద్రుఁ డన్నను
వారించి యన్నమ్మ దగ్గఱ కరిగి వినయముతో "తల్లీ! నీపై
బగచే నేను బొంగరము వదలలేదు. నీకిది కష్టము కలిగించి
నది గనుకనే నీవు నన్ను తూలనాడితివి. నాతప్పు మన్నించి
కరుణింపు"మని బాలచంద్రుఁ డన్నమ్మను కోరెను. తన
పచ్చవన్నె పట్టుబట్ట చించి బాలచంద్రుఁ డామెకాలికి గట్టు
కట్టి గాయము మాన్పుకొనుటకై యామెకు అయిదువందల
మాడలుకూడ నిచ్చెను. అన్నమ్మ మోము వికసించినది. తద
నంతరము "అమ్మా! నా జనకుఁ డిప్పు డెక్కడ నున్న
వాఁడంటివి?" అని శాంతముగ బాలచంద్రుఁ డాకాంత నడి
గెను. ఐతమ్మ నడిగి తెలిసికొమ్మని యామె బదులు చెప్పెను.
సపరివారుడై బాలచంద్రుఁడు మేడపి కరిగెను.

## II

తమ్ములతో గలసి బాలచంద్రుఁ డింటికిబోయి
తల్లికి నమస్కరించెను. ఆమె దీవించెను. "నాతండ్రిగా రిప్పు
డెందున్నారు? చెప్పు"మని వెంటనే బాలచంద్రుడు తల్లిని
బ్రశ్నించెను. వాడిములుకులు గుచ్చుకొన్నట్లే మాటలు

తగిలి ఐతమ్మగుండె వణియుల య్యెను. కన్నులకు గప్పు గప్పెను. కంటనీటివాలునంబడి కాటుక జాలువాఱెను. రత్న హారములు చిక్కువడెను. పాపట బొట్టూడిపోయెను. తలలోని పూలు చెదరి పుడమిపై రాలెను. ఐతమ్మ మూర్ఛపోయెను.

బాలుని పరిశ్నతో ఐతమ్మకు బాలుని యుద్ధప్రయత్నము గోచరించెను. ఆమెయది వారింపదలచెను. "కుమారా! మలిదేవుని యాజ్ఞ మట్టై మీనాయనగారు వానివెంట తరలినారు. ఎక్కడికి కరిగెనో యెఱుగను" అని ఐతమ్మ బదులు చెప్పెను.

"తల్లీ! నీ వెన్నడును నసత్యము నెఱుఁగవు. నేడిట్టి మాట లెందుకు? మలిదేవరాజు కలనికై కార్యమపూడి కరిగినాఁడు. సమరసన్నాహముతో వానివెంట నాతండ్రియు నరిగి రణమాచరించుచున్నమాట నేనెఱుఁగుదును. నీవేల దాచెదవు? కన్నతండ్రి ఋణవిముఁగ రణమాడని కొమరుఁ డున్ననేమి? లేకున్ననేమి? 'జనఁడే పుత్రుఁడై జనియించు'నని వేద ఘోష గలదు. కలనిలో నావలన నేమియగునని నీ వెంచ జనదు. నా కసాధ్యమైన పని లేదు. బ్రహ్మాండములు పగుల గొట్ట నేర్తును. సూర్యచంద్రులతో బంతులాడ నేర్తును. ఇంక నాచేగాని పనియేది? కామరాజు సేనను కడిగివేసెదను. నీవు మనసు నెట్టికలతకొని యెంతో చింతింపబనిలేదు. అనుమతిచ్చి పంపుము" అనితొందర పెట్టసాగెను.

ఆమె కేమియుదోచక తనయత్తగారి దగ్గరకు పరువెత్తెను. కార్యమెల్లవిని యత్తయగు శీలమ్మ దైవజ్ఞులఁ బిలి

పించి బాలుని జాతకచక్రమును వారికి చూపించెను. పదునేను దినములలో బాలుఁడు కడతేరబోవుచున్నాఁడని వారు జోస్యము చెప్పిరి. శీలమ్మ ఐతమ్మను బిలిచి "బ్రహ్మవ్రాత తప్పదు" కాలమెవ్వరికిని గడవరానిది. నీమాటపైనతడు నిలువనిమాట నిశ్చయమె. కాని పడవలసిన పాట్లు పడకతప్పదు. వానిభార్య మాంచాల నిండుజవ్వనములోనున్నది. ఆమెరూపమనన్యము. అదృష్టమున్నచో నామె పలుకులవలన గరిగి పోయి యితఁడాగినను నాగవచ్చును" అని యుపాయము చెప్పెను. అది విని 'సరే' యని వచ్చి ఐతమ్మ కుమారునితో నిట్లు పలికెను.

"కదన మన్నచో సంగడీండ్లతోడి యాటపాట లనుకొంటివా? ఏనుఁగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, రథముల కిఱ్ఱుధ్వనులు, కాల్బలముల యెలుంగులును గలిసి మోగి రణరంగమున బ్రతిధ్వని సేగుచుండును. కత్తి తళతళ జూడలేని నువు కత్తి కోతలగాంచి తాళగలవా? నీవెక్కడ? అనిసేత యెక్కడ?" అని తల్లి నిరుత్సాహవచనములాడెను. అవి విని బాలచంద్రుఁడిట్లు బదులు చెప్పెను.

"నన్నేల భయపెట్టెదవు తల్లీ! పుత్రమోహము వదలలేక బొంకుచున్నావే కాని నాబలిమి యెఱుఁగవా? నలగాముఁడు నాకెదురునిల్చి బ్రతికిపోగలఁడా? రణరంగము నెల్ల పీనుగుపెంటలు గావించెదను. శత్రుసేనల కుఱుమని పిడుగనై ప్రవర్తించెను. పగవారి రక్తముల మడుగులు కట్టించెదను. చూడు"మని బాలుఁడు రణోత్సుక్యము ప్రకటించెను.

ఐతమ్మ విచారసాగరమునకుఁ జెలియలికట్ట వ్రాసెను. కుమారా! నీ జన్మ చరిత్ర నే నాజన్మము మఱువరానిది. నీకై పడరాని పాట్లు పడితిని. నోమరాని నోములు నోచితిని. అలవిగాని దానధర్మము లొనరించితిని. సొమ్ములు కొల్లబెట్టి దెసమాలినవారికి బెండ్లిండ్లు సేయించితిని. పాడు దేవాలయములు బాగొనరించితిని. క్రొత్త యాలయములు ప్రతిష్ఠించితిని. వనములందు చలువపందిళ్ళు వేయించితిని. విష్ణుకాంతము, జగజ్జ్యోతి, ఏకబాణము, పచ్చవిల్తుఁడు, నందికేశ్వరుఁడు, కేదారేశుఁడు, ఈ నోములన్నియు బట్టి నోచియుంటిని. సేవింపరాని పుణ్యక్షేత్రములు తక్కక మీఱి సేవించితిని. కాని పరమేశ్వరునకు దయ రాలేదు. వరమీయలేదు. తుద కొకానొక పుణ్య దినమున నాకాశవాణి జగనిమ్మ నోము నోయమని తెలిపెను. అది దుర్ఘటమైన వ్రతమయ్యు, భూసుర ప్రవక్తమైన శాస్త్రమార్గమున నాచరించి ధన్యత జెందితిని. ఒకనాడు తటాలున నా పళ్ళెములో నొక ఫలము వ్రాలెను. నే నద్దానిని విప్రాంగన కొసంగి మా యేడుగురు సతులకు బంచి యిమ్మని కోరితిని. ఆ పండు నెనిమిది భాగములు చేసి యా విప్రాంగన తానొకటి గైకొని, తక్కిన యేడును మాకు బంచి యిచ్చినది. నా భాగ్యము పండినది, నీవు నాకు జన్మించితివి. నీవే నాకు ప్రాణమవు. నీవే నాకు దిక్కు. నిన్ను వదలి నే జీవించుటకల్ల. పోదలఁచితివేని నాకు విషమిచ్చి మఱియు బొమ్ము" అని ఐతమ్మ మఱి మఱి విలపింపదొడగెను.

బాలచంద్రుని మనస్సు మఱింత ఱాయి యయ్యెను. "కార్యమపురిలో దండ్రి రణమాడుటయు, గొడుకునైన నేనీ యింట గుడిచి విచ్చలవిడి తిరుగుచుండుటయునా? కుమారా? నీకిది తగనిపని' యని తల్లివైన నీవు నాకు గఱప వలంతివి. అట్టిచో నీవును బ్రాకృత కాంతవోలె పిఱికితనము కఱపుట యొప్పునా? మా తండ్రిగారి యనిసేతతో నీవింత దనుక వీరకాంతవు మాత్రమ. నా కారణమున నీవింక వీరమాతవును గానున్నదానవు. నీ కిది గౌరవప్రదము కాదా? ఏలిన రాజు లొక్కరైన బ్రతికి నిలువలేదు. కాయ మనిత్యము. కీర్తియే నిత్యము. అడవిలో దాగినను నిప్పుడో ఎప్పుడో మరణింపకతప్పదు. అట్టియెడ రణరంగముననే వీరమరణము గాంచగలిగితినేని నత్కృష్టముగాదా? లోకములో నిద్దరే ధన్యతములు. ప్రాయోపవేశమున దేహమును జాలించి కైవల్యమునందు మహాయోగి యొక్కరుఁడు, సామ్రాజ్య సంరక్షణార్థము రణతలమున మరణించి వీరస్వర్గమునందు మహావీరు డొకఁడు. తక్కిన మరణములన్నియు నెన్నిక రానివ. తక్కొరులవోలె దానధర్మము లాచరించి ముక్తి పొందుదమన్నను నది లభింపదు. మాకు సహజమగు శౌర్యముననే కైవల్యము ప్రాప్తించును; గాని వేఱొండు తెఱగున సమకూఱదు. నీవింతకు మున్నాడిన వడువున సమరతలమున కృష్ణపరమాత్మ సవ్యసాచికి గఱపిన తత్త్వబోధ నేనెఱిగి యాచరింపదగినదియ. సామ్రాజ్య తరు వెండిపోవునప్పుడు మొదళులో వీరరక్తము స్రవించిననే రెమ్మలు చిగుర్పుటయు

గొమ్మలు చేవ దేలుటయును. రక్తస్నానము రాజసేవకులపని. అందులకే నే నరిగెదను మగువలు నివసింపదగిన మందిరములలో మగవారు కాలము పుచ్చరాదు. నేను పిన్నవాఁడను కాను పిట్టపిడుగను. నాకెదురులేదు. పోయివచ్చెదను. నన్ను దీవించి పంపుము' అని బాలుడు తల్లిని కోరెను.

బాలుని సంకల్ప మెంతమాత్రము మాన్పరాదని వీరమాతకు గోచరించెను. తన యత్తగారి "యుపాయము ప్రవర్తింపఁజేయుటకై కొడుకుతో నీరీతిబలికెను. యుద్ధారూఢులై చనువారు తల్లిదీవెన యొక్కటిమాత్రము గొని చనఁజనదు. సతీమణి దీవెనకూడ కైకొనిపోవుట శ్రేయస్కరము", తల్లి పలికిన మాటలాలించి బాలచంద్రుఁడిట్లు బదులుచెప్పెను. "మాంచాలకు నాగుర్తే తెలియదు. పెండ్లిపీటలపై సిగ్గుసుడులలో మునిగి నన్ను కన్నెత్తియైన చూడకుండెను. పూర్వజన్మఫలముగ బ్రహ్మ మమ్మాలుమగలుగ సృష్టించెను. అంతియే తప్ప మాకిసుమంతయైన పరిచయము లేకున్నది. ఇట్టియెడ నేనామె నెట్లు డగ్గరెదను. నీ మాటపై నెట్లో దఱిసినను నాప్రియురాలెట్లు ప్రవర్తించునో! సకియలమనస్సు కత్తెరవంటిది. మాటమాత్రమే మెత్తన. కాన నీసమయమున నేను పోరాద"ని బాలుఁడు తెలిపెను.

అట్లయినచో నేను ముందరిగి వచ్చెదనని ఐతాంబ బయలుదేఱెను. మాంచాల పుట్టినింటివారు గండువారు. ఐతాంబ అక్కచెల్లియండ్రతో గలసి యందలము లెక్కి గండువారింటికిఁబోయెను. మాంచాల మేడదిగివచ్చి సముచిత

పరివారయై యత్తలకెదురేగిస్వాగతమిచ్చెను. మాంచాలయు నామెతల్లియు నాగంతుకుల కతిథిపూజలు గావించిరి. 'ఏదో పనికట్టుకొనివచ్చినా'రని మాంచాలతల్లి వచించెను. మాంచాల ముందునకరిగి నవ్వుచు'మాయత్తగారు తనకుమారుని మగటిమి నాపలేక వారిని నాకడకువచ్చి దీవనగొనిపొమ్మని పలికియుండిరి కావలయు. నాభర్తముఖము చెల్లక రాలేదు. అందుచేతనే యత్తగారు వచ్చినారని జోస్యముచెప్పి,వెంటనే ఐతాంబదిక్కు దిరిగి సమరతలమునకు కుమారుని బంపుటకు సందియమేల? పనుపుడని ప్రార్థించెను. ఆ వీరసతి పలుకు లైతాంబకు ములుకు లయ్యెను. 'పతిని గోల్పోవుట ధర్మమా? ఇది ఎంత పిచ్చి పలుకు! అతనిని వారింతువుగదాయని నీతో జెప్పవచ్చితిమి. నీ మాటల తెఱగు జూచిన మాకు ఖేదమయ్యెడిని. ఇది యే'మని ఐతాంబ కోడలిని మందలించెను. మాంచాలి యిట్లుత్తరమిచ్చెను. "మీ కుమారుడు నా ముఖమైన జూచి యెఱుగడు. భుజించుట, వేశ్యాగృహమున విడియము సేయుట వెలయాలి యింట రేబవళ్ళను వినోదములు రోవెలదితోడనే. ఇది నానోముఫలము. వేశ్యతోడి పొందుకన్న రణ ప్రవర్తన మేలుకదా? సమర జయము గాని సమర మరణము గాని గౌరవహేతుకములు బుణ్యాకరములును" అనిపలికిన కోడలి వచనములు ఐతాంబ మెచ్చుకొనియెను. కాంచన భూషణములను, జీరలను, రత్నములను గోడలికి గానుక లిచ్చి యామె నాలింగనము చేసికొని ఐతాంబ బయలుదేఱెను.

ఐతాంబ యిలు సేరి పుత్రునిఁ బిలిచి మాంచాలచే దీవెననొంది రమ్మని పలికి, లెక్కలేని ధనములను, జీరలను, మణిభూషణములను గంధాదులను నిచ్చెను. బ్రాహ్మణులకును, బేదలకును, దాసులకును, దగురీతి దానములు గావించుకొనుచు బొమ్మని ఐతాంబ కొడుకున కానతి యిచ్చెను. అతఁడవి గైకొని యన్నదమ్ముల వెంట నిడుకొని బయలుదేఱెను. వేశ్యయింటి కరిగి బాలచంద్రుఁడు తన యన్నదమ్ములను వాకిట నిల్పి లోనికఱిగెను. శ్యామాంగితో సరస సల్లాపముల గొంత కాలము బుచ్చి బాలుఁడు తన రణ ప్రయాణము నా కాంతకు దెలిపెను. 'ఎంత వెఱ్ఱితనము! నాఁడు నాటికి గ్రొత్త చవులూరు పరువంపు గొమరు ప్రాయము నెల్ల పీటబుచ్చి రణము సేత కేగుట మేలా!' యని బాలునిగూర్చి వేశ్య యెల్లిదమాడెను. బాలచంద్రునకు బట్టరాని కోపము వచ్చెను వారకాంత మనసు మట్టు లప్పుడతనికి గోచరించెను. 'ఛీ! కామాంధకారము కష్టవిద్య. నీతి మాలినయీ వేశ్య చర్య నేఁటికి నా కర్థమైనది.' అని బాల చంద్రుడు వేశ్యను బోనాడెను. 'మీ మనసు పరీక్షించుటకే నే నిట్లాడితి'నని వేశ్య యాయీ మాయాలాపములతో నా బాలుని మోసపుచ్చెను. బాలుఁడు తెచ్చిన ధనములు, మణిభూషణములు సర్వమును నేర్పుతో నామె యొడిచి కొనియెను, బాలచంద్రుఁడు రిత్త చేతులతో బయటి కరిగెను. తల్లి యానతిచ్చిన తెఱగున బట్టలకును, బ్రాహ్మణులకును, భిక్షువులకును నిచ్చుటకై చేత నేమియు లేక

బాలుఁడు లేమి ననుభవించెను. అది చూడగనే యనపోతున కొడలు మండిపోయెను. 'కామాంధకారము కన్నుల దట్టి క్రిందు మీఁదెఱుఁగక కలధన మెల్ల భోగముదాని కిచ్చి వచ్చితివా! కోటీశ్వరుల కొంప లమ్మించు వేశ్యలను నమ్మిన వాని మొగము చూడరాదు పొమ్ము' అని యనబోతు బాలచంద్రుని దూఱెను. బాలుఁడు సిగ్గుపడి తల వాల్చెను. అనంతర మనపోతు ననుమతిని పొంది తన బంగరు మువ్వల మొలత్రాడు దూడ వీసి యా సొమ్ముతో బ్రాహ్మణ దానములు గావించి బాలచంద్రు డానందము నొందెను.

ఇంక మాంచాలయొద్ద కరుగుట యనంతర కార్య క్రమము. రణయానమును జ్ఞప్తి కెఱయించుటకై యనుజులను వెంట నిడుకొని బాలచంద్రు డత్తవారింట కరిగెను. ఆ మందిరపు ద్వారములు మాణిక్యతోరణములతోను నేల రత్నకంబళములతోను దీపించుచుండెను. విప్రకాంత లెదురు వచ్చి యారతులిచ్చి వారినెల్ల నుచితాసనాసీనుల గావించిరి. సకలవిధ ఫలోపహారముల నందునిచి సేవకులు వచ్చి వారికి వింజామరలు వీవఁదొడగిరి.

ఇది విని మాంచాల శృంగారముగ నలంకరించుకొని తల్లియొద్ద కరిగి "నీ యల్లుని నే నేర్పరించు టెట్లు? అందనేక లానీనులై యున్నారు." అని మనసు విచ్చియడిగెను. ఆమె తల్లియు "నీవరుగగనే లేచి నిలుచువారలు నీ మఱదులు. కూర్చుండినయాతఁడే నీభర్తయని తెల్చికొనుము.' అనిగుఱుతు చెప్పెను. ముగ్ధమైనమూర్తితో మాంచాల గృహాంగణము

ప్రవేశించెను. అనపోతును, బాలచంద్రుఁడునుదప్ప తక్కొరులు లేచి నిలువబడిరి. ఆ యిరువురియందును భర్తనేర్పరింపరాక మాంచాల పొరపాటున ననపోతు పాదములకు నమస్కరించెను. అనపోతులేచి "నేను బ్రాహ్మణుఁడనుగాన నీసేమము సెడునని నిలువనైతిని. నే ననపోతును. నీమఱదిని. అదుగో! శాత్రివభయదుఁడైన "నీభర్త" అని నిర్దేశించెను. అంత మాంచాల "అయ్యా! నీవు బ్రిహ్మకులుడవు. వేదవేత్తవు; కనుక నేను నీచరణములు దాకుటలో దోసమును లేదు. నా కన్యభావమును లేదు" అని యనపోతుతో బలికి బాలచంద్రు నొద్దకరిగి వాని పాదములు పన్నీటితోఁగడిగి తుడిచెను. అనుజులవంక బాలచంద్రు డొక్కచూపు చూచెను. అది వా రర్థము చేసుకొని 'తేపకడ వత్తుము. రణము మాట మఱువకుము" అని పలికి బయలుదేరి చనిరి.

నేటికి గడా పండువని మాంచాల భర్తను పరమ భక్తితో సేవించి తనివినొందెను. అనంతరము మాంచాల బాలచంద్రుని చెంత నిలిచి "జన్మవృక్షమునకు జవిగల ఫలములు రెండు. మొదటిది భోగము. రెండవది కీర్తి. తొంటిదిప్పుడు లభించినది. ఇంక కీర్తిసంపాదన మనంతర కరణీయము. లెండు రణమునకుబొండు" అని బాలచంద్రుని బ్రేరేపించెను. అతని మనసున బశ్చాత్తాపము మొలకలెత్తెను. "హా! ఎంత మూఢుడనైతిని. వేశ్యపలుకులకు నీమె పలుకులకు నెంత తారతమ్యము గలదు! ఇట్టి వీరకాంతవిలువ ఎఱుగక

తో గ్రిసిపుచ్చి పాడువేశ్యను బట్టుకొని నిందపాలైతినిగదా”
యని బాలచంద్రుఁడు తన్నుదా దిట్టుకొనెను.

మాంచాల ముఖపద్మము వికసించెను. “కాంతి
పుంజమా! మీకు సాహసమమరుగాక! శాత్రవజయము సమ
కూఱుగాక! చెన్నకేశవుఁడు వరములిచ్చి మిమ్మోమ్మగాక!
మీరు కలియుగ పూజలంది చిరకీర్తి నందుదురుగాక!” అని
మాంచాల భర్తను దీవించి యాయుధము చేతికందించెను.
బ్రహ్మహత్యా పాతకము రాకుండుటకై యనపోతును
మాత్రము రణమునకు గొనిపోవద్దని మాంచాల యాదేశించె.
సరే యని బాలచంద్రుడు బయలుదేఱెను.

## III

బాలుఁడు తల్లిచేతి యన్నమును గడుపార భుజిం
చెను. మేను చందనమున నలందికొనెను; రత్నాలంకారములు
కై సేసెను; మాతృదేవతకు భక్తిమై నమస్కరించెను. “నీకు
దేవేంద్రవైభవము గలుగుగాక! వీరభద్రుని బోలె విజయ
మందుదువుగాక! వైనతేయుని వేగమును, రామచంద్రుని
రాజసమును, భీముని పరాక్రమమును నీకు సిద్ధించుగాక!
పొమ్మ”ని తల్లి కుమారుని దీవించెను. తమ్ములను, బరి
వారమును గొని బాలచంద్రుఁడు బయలుదేఱి, మార్గము
నందలిధరణికోటను గెలిచి, పాండ్యులను దమలో జేర్చికొనెను
భద్రసాలేయ మనెడి ఛత్రము నంపుమని బాలుడు తల్లికి
గబురంపెను. ఐతమ్మ దానిని సేకరించి కొమరుని కంపెను.

బాలచంద్రుఁడు ప్రయాణము సాగించుటకు ముందు మాంచాల మాట ననుసరించి అనపోతును వెనుకకు బంప వలసియున్నది. అందుల కుపాయ మవసరము. ముత్యాల మాలయు, ముద్దుటుంగరమును దాను మాంచాల యొద్ద మఱచి వచ్చితిననియు, నది తెమ్మనియు బాలచంద్రుఁడు అనపోతునకుఁ జెప్పి యంపెను. బాలచంద్రుఁడును, దమ్ము లును బ్రయాణము సాగించిరి. మార్గమున ద్రిపురాంత కమునందొక రావికొమ్మ కొకయుత్తరము కట్టి బాలుఁడు ముందునకు సాగెను. దారిలో ముటుకూరు కాపులు వచ్చి మ్రొక్కి యచట విందారగించి విశ్రమింపుఁడని వారి నాహ్వా నించిరి. 'పోవునది కలనికి. నిల్చుట కిది సమయము కాదని' తెలిపి బాలుడు ప్రయాణించెను. ఒకకొంతదూరమున గరికి పాటికాపులు వచ్చి వారికి మ్రొక్కిరి. బాలుఁడు వారికి పోక లును, నాకులను నొసంగి పనిచెను.

బాలచంద్రుడు 'కరవ' కరిగెను. అందు నలగొండ కాన్పించగనే యతనికి మేను పొంగెను. తమ్ములతో తానా నలగొండ నొక్కనిముసములో నెక్కెను. వెనుక జిక్కిన పరి వారము తమ్ము గలిసికొంటకై బాలుఁడు తమ్ములతో నచట గొంతసేపాగెను.

బాలచంద్రుడు నలువైపుల దిరిగిచూచెను. అచ్చ టకు రణరంగమెల్ల గానిపింప నతని భావములు పొంగి పొర లెను. "మనమేమి చేయవలయును? శత్రుసేనలో నొకవంక నుండి మునుముపట్టి కోతకానిచ్చుకొని పోవుదమా? అట్ల గుచో నెదుటిబలము నొంగిలిచేసి విడిచినాఁ" డని మనవీరులు

కోపింతు రేమో!—సంధికార్యములు నడుచుచు నేయున్నచో మన సంరంభము చూచిన ప్రజలు మనమే పగ తెచ్చితిమని దూరుకొందు రేమో? ఏమి చేయుదము?" అని బాలచంద్రుఁడు సంకోచించెను. చెలికాండ్రెల్ల బాలచంద్రుని గలనికి బురి కొల్పిరి. అంత బాలుడు పర్వతమునుండి కుప్పించి రణరంగ మున కెగసి యుఱికెను. సేనా సముద్రమునందు బాలచంద్రు డొక మందరమయ్యెను. రాజులు వడకసాగిరి. ఏనుఁగులు గుఱ్ఱములు, నాయాదిక్కులకు బరువువెట్టి తత్తర మొంద సాగెను. కాల్బలమెల్ల కలగెను. "నరసింహునిపాలిటమృత్యు "వీ రూపమై వచ్చిన"దని కొందఱు వీరులు పల్కుచుండిరి. వచ్చినాడు బాలచంద్రుఁడు కదన గాండీవియగు బ్రహ్మన్న కొమరుఁడు, తొలంగుఁడు; తొలంగు" డని కొందఱు పెద్దలు ప్రజలను దూరమున కదల్చుచుండిరి. వచ్చిన 'దాఁటిబడి బాలచంద్రుఁ డనుజులతో మలిదేవుని కొలువులోనికి హుటాహుటి పిడుగు వడువున జొచ్చుకొని పోయెను.

మలిదేవుని కొలువులో మంత్రియగు బ్రహ్మనాయఁడును, బంధువర్గమును సకల వీరులును నాసీనులై యుండిరి. ఒక వంక నెదిరినుండి సంధి రాయబారమును గొని వచ్చిన దొరలు కూర్చుండి యుండిరి. ఆదొరల మొగములెల్ల బాల చంద్రుని రాక చూడఁగనే వాడిపోయెను, "ఇంక సంధికుదరదు దుర్విధిని దప్పింపలేము" అని వారు తేల్చుకొనిరి. మలిదేవుని వీరులుకొందఱు కుమారుని రభసమునకు, గనలి రాజదర్శ నమున కనువువఱచు దారినీయకుండిరి. "మలిదేవరాజు మంట పమునకు బోవలె, దారినిండు" అని బాలుఁడడిగెను. కాని

వీరులు దారినీయ లేదు, పట్టినపని కెదురెరుగని బాలచం ద్రుఁడు మదపు టేనుగులపై కుఱుకు సింగపు కొదమవోలె నచ్చటినుండి యెగిరి మలిదేవుని మంటపమున కుఱికెను. పిడు గడచినక్రియ సభయెల్ల నదరిపోయెను. బాలచంద్రుఁడు వినయ వినమితుఁడై రాజునకు నమస్కరింపగా మలిదేవుడు పెడమోము పెట్టెను. "రాజా! నావంక జూడ వేల? నేనేమి చేసితిని? నా తప్పేమి?" యని బాలుఁడు ప్రార్థించెను.

ఇంతలో గన్నమదాసు లేచి కత్తిఝుళిపించి "చూడు డీబాలుని గద్దఱి పనులు. ఇతనిపాటి వీరుఁడు లేడని కావలయు నిట్లు మత్తిల్లియున్నాడు. మా పేరు విన్నంతమాత్ర పర బలంబులును, మా బలంబులును వణకుచుండును. ఇట్టిమేము వీని కెనకాకపోతివా! ఓరీ! ఇటనుండిపోదువా? ఖండింతుమా? అని పలికెను. "విపినప్రవర్తులనుడై వాగులనీళ్ళు ద్రావి, యడవిపండ్లు మెసవి సమర మనుమాటే మరచినారు కాన మీకు కత్తులు త్రుప్పుపట్టినవి. అందుననే మీకత్తులకు పగ వారే కాన్పింపరు! నేనుమాత్రము కన్పించితిని. సరే నన్ను నఱికి త్రుప్పు దులుచుకొనుఁడు. రాజదర్శన మీకుంటకు మీ కేపాటి యరహతకలదు? ఈయ లేదు గావున నే, పైనుండి యురుకవలసివచ్చినది. ఇందునాతప్పేమి?" యని బాలచం ద్రుఁడు పలికెను. కన్నమదాసు కనలి "మారాడితివా? జాగ్రత" యని కత్తి చూపించెను. బాలచంద్రుఁ డుగ్రుఁ డయ్యెను. "చుట్టును శత్రుసేవాసముద్రము మధ్యను లంక వోలె మీరున్నారు. ఆ సంద్ర మొకసారినలువైపుల పొంగి నదా! యీతిన్నె మునిగిపోవుట నిక్కమము. ఇట్టి పౌరుష

హీనులు మీరొక్కరేగాక రాజునుకూడ నిందు తెచ్చి ప్రమాదమున నేలయుంచితిరి? ఇంతకు, నీవు బ్రహ్మనాయని కేమగుదువు? వచింపుము" అనిధట్టించి బాలచంద్రుఁడు పలికెను. 'నేను బ్రహ్మనాయకునికి వరమున జనించిన జ్యేష్ఠ పుత్రుడను' అని కన్నమదాసు త్తరమిచ్చెను. అంత బాలుఁడు మఱింతపొడవై "నీవు బ్రహ్మన్న జ్యేష్ఠపుత్రుడవైనచో నేను నీ తలదన్నిన తమ్ముఁడను. నేను పైనుండి యెగిరి పోవలసిన కర్మమేమి పట్టినది? అన్నలంటి తొడలమీద నడుగులు వేసికొనియే పోగల స్వాతంత్ర్యము గలదు" అని పలికెను. కన్నమదాసునకు బట్టరాని యానంద ముబికెను. "తప్పు నాదే తమ్ముఁడా! యని తమ్ముని నెత్తుకొని దించెను. అది విని, యిది చూచి రాజు తలవాల్చెను.

అంత బాలచంద్రుఁడు "రాజు పుడమియెల్ల శత్రుల కిచ్చి యడవులం బడి దిరుగుచు పొలపు గూరలు గుడుచుట చేతనో యేమో కండ్లకు పసరెక్కినట్లున్నది. నేను మందిచ్చెదను; రమ్మనుడు" అని రాజును దూఱసాగెను.

అందున్న యోధుల నెల్ల బేర్కొని బాలచంద్రుఁడు గలనికి బురికొల్ప మొదలిడెను. "దేవరాజా! వీరుఁడ వని పేరు పెట్టుకొని నీవు జీవించి యుండగ నేకదా నీ కుమారుని శత్రువులు చంపివేసిరి. నీలో శౌర్యము చచ్చెనా యేమి? ముక్కుపై పొడిచినప్పుడు గుఱ్ఱుమనని కోపమెందులకు? సంగర మాసన్నమైనది. నీవు ధనుష్టంకారము చేసినంత నే బ్రహ్మాండములు పగిలిపోవా?" యని బాలచంద్రుఁడు దేవ రాజును బురికొల్పెను.

ఇది యిట్లుండె. అనపోతు మేడపినుండి మరలుచు దారిలో నశ్వద్ధతరువుననున్న లేఖను జూచెను. "చెన్న కేశవుని యాన, మలిదేవుని యాన, నా తండ్రి యాన, నా యాన, నీవు సంగరమునకు రావలదు." అన్న లేఖాంశములు చదివికొనెను. అతఁడు మహాగ్నిపై నూనె పోసినట్లయ్యెను. "నీకిది ధర్మమా బాలచంద్రా! తల్లి దండ్రులకన్న నీవే మిన్నవని తిరుగు నన్ను వదలిపోవదగునా? న న్నొక నెపమున వెనుక కంపి మాంచాల హాస్యమునకుఁ బాల్పఱుపదగునా? బ్రాహ్మణునకు సంగరపుజావు తగదని దలచితివా? ద్రోణ కృపాశ్వత్థామలు బ్రాహ్మణులు కారా! వారికి సమరమరణము గోరక లేదా? నా పౌరుషమును పీటబుచ్చితివి. రాజఋణమీగఁదగుతఱి వచ్చినప్పుడు నా వీర రక్తమును నీరు గావించితివి" అని యనపోతు విలపింపఁజొచ్చెను.

అపుడే మేడపినుండి కార్యమపూడి వీరుల గలయబోవు 'మాడచి' యను కాంత యా దారిన బోవుచుండెను. అనపో తామెకు నమస్కరించి "బాలచంద్రున కంజలి యనుము. నేను తన్ను స్వర్గమున కలిసికొందుననుము. ఈ కలుషము తన్ను చెందదనుము. నా మరణానంతర మీ జందెమును దీసికొని యాతనికిమ్ము" అని తెలిపెను. అతడు దశేంద్రియములను బిగించెను; తన తల్లిదండ్రుల నెంచి నమస్కరించెను. చెన్న కేశవుని బ్రార్థించెను. తన శిరస్సును తానే కోసుకొని మరణించెను.

మాడచి కార్యమపూడిలోని శిబిరము జొచ్చునప్పటికి వీరులు విందులారగించుచుండిరి. మాడచి బాలచంద్రుని

వెదకి, దగ్గఱి, యనపోతు మరణము దెలిపెను; సందేశమును వినిచెను. రక్తసిక్తమైన జందెము నొసంగెను. బాలచంద్రుడు 'యుద్ధము' 'యుద్ధము' అని యార్చుచు భోజనము విడిచి లేచెను. నరసింగుని తలగోసి రాజున కిత్తును. కులవిరోధము తీర్తును" అని శపథము చేసెను. వైరి రాజులు సంధి కానే రదని యాశ వదలుకొని చనిరి.

బాలచంద్రుని జూచి వీరులెల్లరును "నాయనా! ఐతాంబకు లేక లేక కలిగిన కొమరుడవు. పిన్నవాడవు. శత్రుదళములకు మితిలేదు. సమరసాహసము వలదు. మామాట విని మమ్మాదరింపుము" అని కోరిరి. అందుపై బాలచంద్రునకు రోష మతిశయించెను. "రాజాన్నము తిని విడియములు చేసిన వీరులు మీరే యిట్లాడిన నేమన నేర్తుము? నాకే ప్రథమ తాంబూలము కావలయును. నేను పిన్నవాడనా? కాను. పిడుగను. బాలురే తల్లిదండ్రుల ఋణము దీర్పవలసినది. మానాభిమానములును బాలురకే యెందు. మగతనము బాలురకేమిక్కిలి. పెద్దలకు మగటిమి తక్కువ, పటిమకొద్ది. వారికి మనసు చలించును. ధైర్యము తగ్గును, కీర్తికైనను నపకీర్తికైనను, భారమంతయును బాలురపైననే గలదు. కాన నేనే సమరము సేసి స్వర్గమును జూఱగొందును" అని బాలచంద్రుడు పలుక జొచ్చెను.

బ్రహ్మనాయుడు కుమారుని వారింపదలచెను. "కుమారా! నీకీ దిట్టతన మెప్పు డలవరినది? వింతమయ్యెడిని! ఏనుఁగులు, గుఱ్ఱములు, కాల్బలము, కుంతములు, గొడ్డండుఁ ముసలముద్గరములు, చక్రతోమరములు, శస్త్రాస్త్రములు

నివన్నియు జూచినప్పుడు భావము చెదరక మూనను. ఇప్పుడూరక పలికినట్లుగాదు. అప్పుడుగాని భయము పుట్టదు. అర్జునునంతటివాడు కర్ణునిగాంచి కలగి "మన రథంబును మాధవ మరల"నిమ్మని పలికినాడు. జాగ్రత్త" అని బ్రహ్మనాయుఁడు కొమరుని బెదరింప జూచెను.

కాని బాలునకు ధైర్యము హెచ్చెను. 'పిడుగు చిన్నదే కొండను ఛేదింపదా? మిర్యము కొలదిదే! నోరంతయు మండింపదా? దావాగ్ని కొద్దిదే; అడవియెల్ల కాల్పదా! కాన నాకు సర్వమును వశము' అని బాలుఁడు దెలిపెను.

బాలుని ప్రయత్న మనివార్యమని బ్రహ్మనాయునికి గోచరించెను. యుద్ధమునకు నీ వరుగుట నాకు సమ్మతము; కాని దిక్కుల నలముకొన్న నా కీర్తికి మచ్చ పొడమనీకుము. నీ శౌర్యమును మొక్కపోనీకుము. రణమన్నచో గేవల మారణకర్మ గాదు. ఇహసౌఖ్యముల కిది పుట్టినిల్లు. ముక్తికిది మూలధనము. ఎదిరి వీరులు మహాబలులు. వారు తలపడినప్పుడు తలకపోకుము. వారి శరదీప్తికి బెదరపోకుము. కాముఁడు కంపించునట్లు రణమాడుము. నరసింగుని తలనరకి తెమ్ము. నీకు జయమగుగాక! అని దీవించి బ్రహ్మనాయుఁడు బాలుని బంపెను.

ఏను గంబారిపై నరసింగభూపతి రణమున కవతరించెను. బల్లెములుపట్టి బంటు లేసుగుముందు నడుచుచుండిరి. నాల్గువేల విలుకాండ్రొకప్రక్క బలసియుండిరి. నూరెల వారు పదివేలమంది మఱొకప్రక్క దీపించుచుండిరి. అశ్వపంక్తులును మాతంగయూథములును ననంతములుగ నడచు

చుండెను. శూలములు, శరములు దాల్చి వీరులు నేలయీని
నట్లు వెడలుచుండిరి. ఏవంక జూచినను ధ్వజములు, ఛత్ర
ములు, టెక్కెములు, సాంద్రమై కనుపట్టుచుండెను.

రణభేరి మ్రోగెను. బాలచంద్రుఁడు ఒరదీసిన కత్తి
యై పొడిచి నడిచెను. "హో" యని యార్చి యరిసేనలపై
బడి చిందరవందర గావించెను. కొన్ని తలలు ఖండించెను.
కొన్ని చేతులు నఱికివేసెను. కొన్ని కనుగ్రుడ్లు పొడిచెను.
మఱికొన్ని ఱొమ్ములు పగిల్చెను. తొడలు కొన్ని తున
కలు చేసెను. ఏనుగులపైకి సింహమై యెగిరి తుండములు,
తోకలు, దంతములు ఎల్లయుం దుత్తుమురు గావించెను.
గుఱ్ఱములపై ఉరికి డొక్కలు చించి డెక్కలు చెక్కి
ఱొమ్ముల పగిల్చి చెల్లాచెదరు సల్పెను.

నలగామరాజుసేనలు బిడ్డల జూచుకొను నాసబాసి,
ప్రాణములపై ప్రేమదోసి, కలగుండుపడి యేడ్చుచుండెను.
పందలు మాత్రము ప్రాణములు తీపని పాఱజొచ్చిరి. అది
చూచి నరసింహభూపతి "నమ్మిన రాజును నట్టేట ముంచి
పోరాదు. తనవు లస్థిరములు. కీర్తి శాశ్వతము. పాఱిపోయితి
రేని రాజు నాన" యని సేనకు ధైర్యము చెప్పి కలనికి బురి
కొల్పెను. బాలచంద్రుఁడు నెత్తురు టేఱులు పాఱించుచునే
యుండెను. ఒకని కాలు, ఒకని తొడ యింకొకని తల యేక
బాణమున గ్రుచ్చి యెత్తిచూపఱకు భీతి గొల్పుచునే యుం
డెను. శత్రుల శరవర్షధార లెంత బలవత్తరములయ్యు బాల
చంద్రుని పాటవమును సడల్పలేకపోయెను; మీఁదు మిక్కిలి
వాని రోషమున కింధనములయ్యెను. ఇతఁడు వీఁడు, ఇతఁడు

కాడు' అని యేర్పరించుకొనుటకు, బాలచంద్రుఁడు తమ
కము పట్టలేకుండెను. బాలచంద్రుఁడు తెల్లని యేనుగుపై
రణమాడు మహావీరు నొక్కరుని గాంచెను. వానిపై కుఱికి,
యార్చి, బాలుఁడు తనకత్తితో నాతని శిరస్సు నఱికివైచెను.
తోడనే యా తలను జేతదాల్చి నెత్తురు కేరు లీడుకొనుచు
బ్రహ్మనాయని యొద్దకరిగి చూపించెను. బ్రహ్మనాయఁ డది
గాంచి 'ఇది నరసింహుని తల గాదు. అతఁ డన్న దగ్గఱ
నున్నాఁడు నీవు తెలియలేవైతివి? అని యాగ్రహమొందెను.
బాలచంద్రుని రౌద్రి మిన్నుముట్టెను. 'ఏడీ నరసింహుఁడు?
ఎక్కడున్నాడు? ఎందు దాగినాడు? ఎటకు బాఱినాడు?
అని హుంకరించుచు బాలుఁ డెగిరి సేనా మధ్యమున వ్రాలెను.
కేరళాధీశ్వరుని బొడిచి, పుడమికి ద్రోసెను. కర్నాటక
రాజును చీల్చి ప్రక్కకు జిమ్మెను. మాధవారిపుని ద్రుంచి
యార్చెను. బర్బర నాయకుని కరములు నఱకి చంపెను.
తుదకు నరసింహుఁడు దొరకెను. బాలుఁ డతనిపై కుఱికి
కత్తితో బొడిచెను. నరసింగరాజు తిరిగి యంకుశమ్మున
గ్రుచ్చి బాలుని ప్రేవులు లాగెను. బాలుఁడుగ్రుడై నరసిం
హుని వక్షమున జొనిపిన కత్తి వీపున వెడలజొచ్చెను. ఇది
సమయమని బాలుఁ డతని తల ఖండించుకొనిపోయి తండ్రి
యెదుట పెట్టెను. కొలువెల్ల నరసింహుని శిరమునకు నమ
స్కరించిరి. బ్రహ్మన్న దుఃఖించెను. "బాలచంద్రా! నేను
చేతిమీఁదుగ బెంచిన నరసింహుని కెట్టి హీనత దెచ్చితివి?
నిన్ను రాజు బిలువనంపలేదు. ఏల వచ్చితివి? వచ్చినవాఁడ

వ్రూరకుండక సేననెల్ల చూరగొంటివి" అని బ్రహ్మనాయ
కుడు కుమారుని దెగడెను. బాలచంద్రుఁడు రోషము
వహించి కొలువులో నలరాజు నొప్పగించితివి. కోడిపందె
మున బుడమి పోగొట్టితివి. నమ్మి వచ్చిన నీ మేనమఱది
ప్రాణమును గొంటివి! చెవులరాయని వేంకజోదును మాయ
చేసి చంపితివి అని తండ్రి నెత్తి పొడిచెను. "వెన్నిచ్చి
వచ్చిన పందవు నీవును వీరుడవేనా?" యని బ్రహ్మన్న
బాలుని దెగనాడెను. బాలుఁడు తటాలున బయలుదేరి రణ
మున కురికెను. అప్పటికే కమ్మర కాచన్న, మంగలమల్లు,
కుమ్మర పట్టి, చాకల చందు, నెల్లరు పరదళంబులపై బడి
చంపి చచ్చిరి. బాలచంద్రుఁ డది విని రోష దుఃఖములు
పెనుగొన రణమాడజొచ్చెను. సేన లెల్ల పాఱజొచ్చినవి.
మహావీరులెల్ల బాలుని చేతిలో మరణించిరి. కాని బాలుని
యాత్మ మిత్రులం జూడబోయెను. లోకమిత్రుఁ డీ ఘో
రము చూడలేక యస్తాద్రి జేరెను.

బాలచంద్రునితో నెనయైన వీరుని వేలు మడిచి
చెప్పవీలులేదు. భారత వీరుడైన అభిమన్యుఁ డొక్కరుడు
సాటిలేడా! యతడే యీతఁడై పొడమి భారత దేశమును
మఱొక్కసారి మేలుకొలిపి యుండెను. ఈయన రూపము
కవిరాజుల కావ్యములలో నచ్చు గుద్దుకొన్నది. మహా
శిల్పుల శిలలలో మూర్తీభవించినది. ఇంక భారత మహిళా
లలామలు పసిగుడ్డుకు బెట్టు నుగ్గుపాలలో రంగరింపబడు
గాక! విద్యార్థులు పఠించు సంధ్యావందన మంత్రాక్షరము
లలో బాలచంద్ర నామము చొన్పబడుగాక!

# రాయలు – తిమ్మరుసు

## 1

"అమాత్యశేఖరా! మా తండ్రిగారి యవసానాజ్ఞను నిర్వర్తించుటకై నన్నెట్లు పట్టాభిషిక్తు గావించితిరో, నేటి నా యవసాన సమయాభిలాషను గూడ నట్లె నిర్వర్తింప గోరుచున్నాఁడను. నా కుమారుఁడు తిరుమలరాయఁడు బాలుడు. రాజ్యమును సంరక్షించి, వానినిఁ బెంచి పెద్దవానిని జేసివానినే రాజ్యాభిషిక్తుగావింపుడు. కృష్ణరాయల కన్నులు నాకొమరునిజంపి సింహాసన మెక్కునేమోయని నాభయము. మీరిప్పుడు క్రూరము నాక కృష్ణరాయల కన్నులుపెఱికించి తెచ్చి నాకుఁజూపుఁడు. తదనంతరముగాని నాప్రాణము లీ బొందిని వదలిపెట్టవు" అని మఱిమఱి వీర నరసింహరాయలు తిమ్మరుసుతో బలికెను.

తిమ్మరుసు వీనుదోయి కీ పలుకులు ములుకులయ్యెను, తిమ్మరుసు క్రుమ్మరిపడెను. ఆయన కేమియును బ్రత్యుత్తర మిచ్చుటకు దోచలేదు. తిమ్మరుసున కిదివఱకు వీరనరసింహుని వీరగుణములే తెలిసినవి. అతని కౌటిల్యము బయలుపడ లేదు. నేఁడది బయటపడినది. కాని మంత్రితా నేమనుటకును నది సమయముకాదు. అది రాజున కవసానసమయము. "ఏమి యాలోచించుచున్నారు? మహామంత్రులవారూ! నాకోర్కె తీర్చిననేగాని ప్రాణమును వదలజాలను. ఇది యాలోచనకు సమయముగాదు, పోయిరండు" అని రాజు వేగిరపెట్టసాగెను. "రాజేంద్రా! ఆలోచన యేమున్నది! అదికావించు తెఱవర యుచుంటిని. ఇదిగో పోయివత్తును" అని తిమ్మరుసు తటా లున బయలు దేఱి చనెను.

తిమ్మరుసు తనకర్తవ్యమును గుఱించి యాందోళనము బడసాగెను. "నా తొడలపై నిడుకొని పెనిచిన కొమరునకెట్లెగ్గు కావింపగలను? నేను పోదిసేసి పెనిచిన లేతమొక్క నేనే చేసేత నెట్లు పెఱుకనోపుదు? ఇది దుస్సహము. నిష్పాక్షికముగ జూచినచో కృష్ణరాయల సమరత తక్కొరులకేరికి గలదు? నాయొద్ద శుశ్రూషను బొందిన యవకాశము కృష్ణరాయల కొక్కనికే గలదు. రాజకీయ విషయముల నీ వీరనరసింహరాయలును నాతనికి గ్రిందిచేయియే యన తప్పదు. ఆతడే యీసామ్రాజ్యమును శాసింపదగినవాఁడు. తిరుమలరాయ లెనిమిదేండ్ల బాఁలుడు. ఇతనిచేత నేమియగును? దేశమున నెటుజూచినను శత్రుబల మనంతముగ నున్నది. అశ్వపతులు, గజపతులు మొదలగువారలనుజయించిననేగాని సామ్రాజ్య మవిచ్ఛిన్నముగ నిలువనేరదు. చేసిన యేకృషికేని నిలుకడయే ఫలము. కృష్ణరాయలే సామ్రాజ్యము నట్టి నిలుకడకు దేఁగలిగినవాడు. అతడే సింహాసన మధిష్ఠింపదగును.

సరియే యీ ముప్పు తప్పుటెట్లు? వీరనరసింహరాయలను మోసపుచ్చినగాని కృష్ణరాయ రక్షణము కానేరదు. కాన నేనరిగి యాడుమేక కన్నులు బెఱికించికొనిపోయి చూపుదును. 'ప్రాణవిత్త మానభంగమందు బొంకవచ్చు నఘము పొందదధిప' యనికదా శుక్రనీతి! దీనదోషము లేదు అని తిమ్మరుసు బయలుదేఱి యట్లు కావించెను.

వీరనరసింహరాయలు మరణించెను. కర్ణాటసింహాసనమున కలంకారము దెచ్చుభారము తిమ్మరుసు మహామంత్రిపై

నుండెను. కాని దేశములో పలువిధములగు భావములు తాండవించుచుండినవి. మంచిగాని, చెడుగునకుగాని, యెల్లప్పుడును రెండువక్షములును నుండనే యుండును. తిరుమలరాయఁడే రాజు కావలెనని యొకపక్షము వారు దలఁచుచుండిరి. మఱియు వీరనరసింహరాయలను మోసపుచ్చినందుల కాపక్షము వారు తిమ్మరుసును దెగడుకొనుచుండిరి. ఇంక రెండవ పక్షము వారు "ఆహా! తిమ్మరుసు యెంత సమర్థుడు! ఎంతటి దయాపరుఁడు! ఎంతటి యుచితానుచిత వివేకి! కృష్ణరాయల కన్నులు పెరికింపక తప్పించిన తిమ్మరుసును దేశమెల్ల నారాధింప వలసినవాడు కాక మఱేమి! దేశమునకు గుండెదుడుకు వాపినాడే" యని పొగడుకొనుచుండిరి. అంతఃపురములోని ప్రతివారును తిమ్మరుసన్న పితృసమానునిగనో, దైవసమానునిగనో చూచుచుండిరి. రాజోద్యోగస్థు లెల్లరు తిమ్మరుసన్నచో రాజ్యమున కాపద్బంధువని నమ్మకతో నుండిరి. సామంత మంత్రివర్గమెల్ల తిమ్మరుసును బూలతో బూజించుచుండిరి.

తిమ్మరుసు తానుచేయదలఁచినపన్నిటో ధర్మమున్నప్పుడదిచేసియే తీరును. "ప్రారబ్ధ ముత్తమగుణాన పరిత్యజంతి" ఉత్తములు తాము చేయవలసిన కార్యమును వదలిపెట్టరు. శుక్లనామసంవత్సర మాఘ శుద్ధ చతుర్దశినాడు కృష్ణరాయలకు బట్టాభిషేకము జరుగునని తిమ్మరుసు సామ్రాజ్యమున బ్రకటించెను. మహారాజులకు, సామంతులకు, బెద్దలకు, నెల్లరకు తిమ్మరు నాహ్వానములు పంపించెను.

విజయనగరమెల్ల దేవేంద్రనగరమును బురడించు

చుండెను. గృహస్థులు తమతమ వాకిళ్ళలో బచ్చిపచ్చాకు పందిళులు వేసి కంబములకు వివిధములగు పూవుదీవలను ప్రాకించిరి. కలవారు మాత్ర మాతీవలకు రత్నములు గ్రుచ్చి గుత్తులుగుత్తులుగ వ్రేలాడగట్టికొనిరి. పందిళులకు నలువైపులనున్న నిలువుటద్దములలో నాసొగసెల్ల ప్రతిబింబించుచు మార్గగాములకు వినోదము నొసఁగుచుండెను. తిమ్మరుసు పన్నీరుచల్లించి, వీధులందెల్ల ముత్తియపుమ్రుగ్గులు వేయించి గోడలెల్ల మృగమదపంకముతో నలికించి వానిపై జిన్నెలు వన్నెలుగ జిత్తరువులు వ్రాయించెను. సామ్రాజ్యమున మూలమూలలెల్ల నిట్లుండ నింక రాజమందిరములలోని సన్నాహము వర్ణించుటెట్లు? అది వర్ణనాతీతము. రాజమందిరము లలంకరించిన దాసదాసీజనములకు దిమ్మరుసు రత్నరాసులు దానము లొసంగుచుండెను.

అదిగో యిదిగో యనుచుండ చతుర్దశివచ్చెను. తెల్లవాఱునప్పటికి సామంతరాజులెల్లరు సపరివారులై విచ్చేసిరి. శ్రీరంగపట్టణమునుండి కుమార వీరశ్యామలరాయఁడు వచ్చెను. కందగోలినుండి యార్వీటి శ్రీరంగరాజు దయచేసెను. నంద్యాలనుండి నారపరాజు విజయము చేసెను. ఆకువీటనుండి ఇమ్మరాజు చేరికొనెను. గండికోటనుండి పెమ్మసాని రామలింగన్నభూపతి యేతెంచెను. కొచ్చెర్లకోటనుండి రావెలపెదతిమ్మభూపాలు డరుదెంచెను. వెలుగోడునుండి వెలుగోటి కుమారతిమ్మభూపాలశేఖరుఁడు వచ్చెను. ఇంకను వచ్చిన సామంతభూపాలురకు లెక్కలేదు. వారి నొక్కొక్కరి నొక్కొక్క ప్రాసాదమున విడియించి తిమ్మ

రుసు వారిని పట్టాభిషేకమహోత్సవ మంటపమునకు వెంట గొనివచ్చెను. సామ్రాజ్యమున నాబాలగోపాలము ప్రజలు వచ్చి సభ నానందమయ మహాసముద్రముగావించిరి. వేద వేదాంగములం దపరబ్రహ్మలైన బ్రాహ్మణులు,సర్వశాస్త్ర సమధిగమము గావించిన పండిత ప్రవరులు, నానాస్థానము లందు జయములందిన కవితా పితామహులును, శిల్పులును, గాయకులును,చిత్రకారులును నెల్లరును సభనలంకరించి చిరు నగవుల తోరణములుగట్టిరి. పట్టాభిషేకలగ్నము దరిసెను.

కృష్ణరాయల గొని తెచ్చుటకై తిమ్మరుసు మందిరము లోని కరిగెను. రాయలు పన్నీట జలకమాడి సర్వాభరణ దుకూల భూషితుఁడై పూవిలుకానివోలె గూరుచుండెను. తిమ్మరుసునుదిలకించి రాయలు లేచి"అప్పాజీ"యని యానంద బాష్పములతో సాష్టాంగ మెరగెను. తిమ్మరుసు వాక్కు-నుండి దీవనము వచ్చునని రాయలయాస. కాని మహామంత్రి చేయూచి తన బలముకొలది రాయలనునుపు చెక్కిళులపై నొక్క చెంపదెబ్బకొట్టెను. రాయలకు నెత్తురు నెత్తికెక్కెను. తలదిమ్మెత్తెను. కన్నులనున్న చల్లని హర్ష జలములు వెచ్చనెత్తి దుఃఖజలములయ్యెను. రాయలు చలికిలబడెను. తిమ్మరుసునకును గంట నీరు గ్రమ్మెను. ఒడలు జలదరించెను. తానును రాయలచెంత గూరుచుండెను. రాయ లొక్కింత తడవునకుఁ గన్నులు విచ్చి తిమ్మరుసు ముఖమును జాలి గలిగించునట్లు చూచెను. తిమ్మరుసు రాయలను గౌగిలించుకొని శిరము మూర్కొని యెంతయును దనివిసనని దండ్రి వోలె ముద్దాడెను.

"కుమారా! పూవుకన్న మృదువైననిగనిగ లీను
చున్న నీ శరీరమును నొవ్వఁజేసితినని కనలఁబోకుము ఈ
పనికోసము నే నెంతో సంకోచించితిని. ఊరకున్నచో
స్వామిద్రోహము. కావించినచో క్రూరకార్యము. ఏది
చేయుటకున్ను మనసొప్పలేదు. తుదకు ధర్మమని తేల్చికొని
యిది కావించితిని. మన్నింపుము కుమారా" యని తిమ్మరుసు
పలికెను. రాయలు ప్రసన్న వదనముతో "అప్పాజీ! ఏల
యీ ఉపోద్ఘాతము. తండ్రి కొమరుని చెఱుపఁదలచునా?
తండ్రి దండించినను నది కొమరుని శ్రేయస్సునకు గాదా!"
యని వినయవినమితుడై వచియించెను.

తిమ్మరుసు మనము మఱింత ద్రవించెను. రాయల
చెక్కిలి పుణికి తిమ్మరుసు "కుమారా! నీ హృదయమును
సంపూర్ణముగ నే నెఱిఁగియే యుంటిని. నేను నిన్నిట్టుశిక్షిం
చుటకుఁ గతము గలదు. ఇనకిరణములైన సోకకుండ ప్రాసా
దములలోఁ బొందు రాజభోగములే నీ కనుభవము. ప్రజల
నొవ్వు నీ కేమాత్రమును నూహింప నలవికాదు. సహజ
ముగ ప్రభువు దండించు టెఱుఁగును, ప్రజ లనుభవించు
టెఱుగుదురు. దండించునప్పుడు రాజు తన మనసులో ననుభ
వించి మరియును విధింపవలెను. లేకున్న నిహమున జన
నిందయుఁ బరమున నధమలోకమునుఁ బ్రాప్తించును. ఒక్క
చేతి దెబ్బ నీ కంతటి నొవ్వు గూర్చినదే? ప్రజ లనుభవించు
కఠినశిక్ష లెంత కష్టతమములో యూహించుము.

నే నాజ్ఞాపించు కాలము మఱొక్క గడియలో గడిచి
పోనున్నది. ఇఁకపై నేను మనవి చేసికొందును. నీ వనుగ్ర

హించి యాజ్ఞాపించుచుందువు. ఇంతదనుక నేను తండ్రిని. నీవు కొమరుడవు. ఇకముందు సామాన్య జనులవోలె నేనును నొక సేవకుఁడ; నీవు రాజవు. కరపపలసిన విషయములలో నొక్కటి యైనది. ఇం కొక్కటి గలదు.

నీ యన్న కొమరుఁడగు తిరుమలరాయని, నీ సహోదరుఁడగు నచ్యుతరాయని రాజనీతి ననుసరించి నిర్బంధములో నుంచితిమి. నీవు పట్టాభిషిక్తుఁడవైన తోడనే వారిని వెలువరించుట నీ యౌదార్యమును వెల్లడించును. కాన నా యిరువురకును గౌరవ జీవనార్థము కొంత దేశమును నొసగి చంద్రగిరిని వారికి నివాసముగా నీయుము" అని పలికి తిమ్మరు సూరకుండెను. శ్రీకృష్ణరాయలు చేతులు జోడించి 'అప్పాజీ! మీ యాజ్ఞ సిరసావహించుటలో నెప్పటికైన మీకు గొమరుఁడనే" అని పరవశుఁడై బలికెను.

" కుమారా! లెమ్ము. అభిషేకమునకు సమయమాసన్న మైనది. పోవుదమా!" అని తిమ్మరుసు పలికెను. తిమ్మరుసు ముందును రాయలు వెనుకనునై తండ్రికొమరుల వోలె నాస్థానమంటపమున కరిగి, వేదోక్తవిధిని బట్టాభిషేకము జరిగి రాయలు రాజయ్యెను.

తత్క్షణమే తిరుమలరాయలను, నచ్యుతరాయలను చంద్రగిరిదుర్గమున కనిపి రాయలు తన యౌదార్యమునకు మెఱుగు వెట్టికొనెను.

## II

తిమ్మరుసు—ఈపూర్వ దిగ్విజయయాత్ర నిక్కముగ నపూర్వము. ఉదయగిరి ముట్టడియందు బదునెనిమిది

మాంసము లోక్కుబిగువున దేవరవారూ గజపతి సేన లతో పనిసేయుటయు, దుర్గము గైవసము సేసికొను టయు; మెచ్చుకోలునకు దగిన విషయములు.

రాయలు—మామాట కేమిగాని మీరు కావించిన కొండ వీడు ముట్టడితో గజపతికి చిట్టుడుకునీరైన పుట్టని గతి పట్టినది. అద్దంకి, వినుకొండ, నాగార్జునకొండ, తంగేడు కేతవరము, కొండవీడు, ఈ సీమలన్నియు దమరు వశము సేసికొనుటతో గజపతి కాయువు పట్టులు సడలిన వన్నమాట.

తిమ్మరుసు—దాని కేమి? కొండపల్లి ముట్టడిలో గజపతి సతీ మణి యొక్కర్తు దేవరవారికిఁ జిక్కినదఁట, నిజమా?

రాయలు—అవును. చిక్కినది. మేము చెఱగొన్న గజపతి బందుగుల నెల్ల విజయనగరమునకు బంపి వేసితిమి.

తిమ్మరుసు—బయలు దేఱిన పని పూర్తియైనది. ఇక మనము నగరము సేరికొందము. మన మిరువురము నొకేసారి నిగలమున లేకుంట శ్రేయస్కరము గాదు.

రా—అప్పాజీ! కటకము వశమైననే దప్ప మాకు నిద్దుర పట్టదు. అది కావించి మరియు మనము నగరము సేరుదము.

తి—దేవరవారి సేనలు తఱిగిపోయినవి. విశ్రాంతిలేని యీ ముట్టడులలో మనవీరులు నశించినంతవఱకు నశింపగా మిగిలినవారైనను మెత్తబడిపోయిరి. మూల బల సాహాయ్య మవసరము. నగరమున కరిగి వలసిన రీతి సన్నద్ధమై వత్తము, రండు.

రా—తమరరిగి సేనలు కూర్చుకొని రాగలరు. మేమిాలోపల సాగుచుందుము.

తి—దేవరవారికిగూడ విశ్రాంతి యవసరముగదా?

రా—అది కటకవశముతోడనే పొందదగినది.

తి—కాని యది కష్టసాధ్యము. మనము కైవశము సేసికొన్న దుర్గముల విషయములలో నందురా! గజపతి కందుల స్థానబలము లేదు. కటక మతని రాజధానియు, నివాసము నగుటచే నతని కందు స్థాన బల మున్నది. బలభద్ర పాత్రుడు, మురారి పాత్రుడు మొదలగు పదునారుగురు పాత్రులును గజపతికి బెట్టని కోట. వీరి పరాక్రమ మజేయము. మన మరుగవలసిన మార్గమందురా? దుర్గమమును నపరిచితమును. నా మనని ధ్యాలింపుడు ఇంతటితో మనము నగరము సేరికొందము.

రా—అప్పాజీ! మిా కెన్నడును మే మెదురాడి యెరుగము. మన్నింపుడు. మిా రరిగి—

తి— రాయలవా రిన్ని రణములలో బాల్గొని యున్నప్పటికిని దనివియు, నలసటయుఁ జెందకున్నవారు. అది తమకు సహజము. నేను దాని నగ్గింతును. కాని చిన్న పామునకైన పెద్ద కర్రతోడనే తాడన మవసరము. అదియు సమయ మెఱిగి సేయుట సమంజసము. కటకమున కీ బిగువునఁ బోరాదు.

రాయలు—'సమయ మిదియే యని మా యంతరాత్మ వేగిర పెట్టుచున్నది. మన్నింపుడు' అని పలుకుచు లేచెను.

రాయలు వేసిన సంకెలలు తిమ్మరుసునకు విదిలించు కొనరాని వయ్యెను. బహు కష్టమున తిమ్మరుసు నగరోన్ముఖుఁ డయ్యెను.

రాజ సేవకుల పాట్లెప్పుడును ని తియే! ధర్మమునకు బద్ధమైన వాక్కు చెప్పక తప్పదు. అది జేఁడొప్పకున్న చో నూరకొని యుండక తప్పదు. అయినను "హితం మనోహారిచ దుర్లభం వచః" ముఖప్రీతికిఁ బోక హితము కఱపు వారు దుర్లభులు. కావుననే తిమ్మరుసు మహామంత్రి తా నోపినంత దనుక జేనికి హిత ముపదేశించెను. తనకు వశము తప్పినది; రాజు నానతి కడనరానిదైనది. తోడనే తాను రాజాజ్ఞ నిర్వహించుటకై బయలువెడలెను. తిమ్మరు సంతవాని కిట్టులయ్యెను. తక్కొరుల మాట నెన్న నేల? రాయల ముందు నిలిచి సేతులు నలిపికొనుచు నంగి వంగి "చిత్తము చిత్త" మని బ్రతుకు సామాన్య మంత్రి కాడు తిమ్మరుసు.

కృష్ణరాయని తండ్రియగు తుళువ నరసింహరాయలు పేరునకు మాత్రమే రాజై యుండగా సర్వమును దానై సామ్రాజ్యమును నొక్క త్రేలఁ ద్రిప్పుచు వచ్చిన మకుటము లేని మహారాజు తిమ్మరుసు.

సవతి తల్లి 'తిప్పాంబ' శ్రీకృష్ణదేవరాయలకు బాల్యమున విషప్రయోగము సేయింపఁ దలంచినప్పు డది తెలిసికొని రాయలు ప్రాణములనుఁ గాపాడి పెంచి పెద్దజేసి సామ్రాజ్యమును రాయలచేతబెట్టిన మహామంత్రి తిమ్మరుసు.

నాఁటినుండి నేఁటిదనుక రాయలు 'అప్పాజీ' యని పిల్వగా దలయూచి యుందికొను గురూత్తంసుఁడును, ప్రజల

కష్టము లిట్లుండును గుర్తించుమని యూచి రాయల చెంప పగులగొట్టిన శిక్షకుఁడును తిమ్మరుసు.

నేఁటి కేయాంధ్రరాజులును సలిపియెఱుఁగని దిగ్విజయ యాత్రలను కృష్ణదేవరాయలచే సలిపించు సూత్రధారి తిమ్మరుసు.

కావున తిమ్మరుసు రాయలకు సాహసించి నీతిగఱప వలంతియే కాని రాయల బలసమర్థతలయందు తిమ్మరుసు నకు నమ్మకము మిక్కిలి.

రాయ లసహాయశూరుఁడు; పలికినంత చేయనోపిన సమర్థుఁడు; సాము గరిడీల నాఱి తేఱిన చేయి; ఉదయసాయం లందు రెండుచేతుల సందున రెండు నిండుబియ్యపు సంచు లిరికించుకొని కోటగోడలపై మువ్మాఱు పరువెత్తుచు జుట్టిన మహాబలవంతుఁడు.

ఇట్టి కృష్ణరాయలకు తిమ్మరు సేమాత్రము పిఱికి మందు వోయుటకును వీలులేదు.

తిమ్మరుసు విజయనగరమునకు మొగమై చన సాగెను. రాయలు సేనలు గొలిచి రా కటకమునుగూర్చి బయలు వెడలెను.

రాయల సేనావారము ఘోరారణ్యముల నుండి చొచ్చుకనిపోవలసివచ్చెను. అవి దుర్గమములు. కాంద్రుకాం డ్రుమని బొబ్బలువెట్టుచు పాఱుచున్న పెద్దపులులు చూచు టకే భీతిగనుండెను. ఘీంకారములు సేయుచు తొండము లెత్తి పరువెత్తు నేనుఁగుపిల్లలు మార్గమున కడ్డదగులుచుం డెను. భయంకరంబైన పంచాననము లడవియెల్ల నదరునట్లు

కొండగుహలనుండి గర్జించుచుండెను. ఆ యిరువైపుల గోత్రి మూకలును నడవిపందులును సేనలను రాచుకొని పోవు చుండెను. తప్పుకొందమన్నను నొక్కప్రక్క నడవిజాతి చెట్లును, వాని కల్లిబిల్లిగ నల్లుకొన్న తీవలను దట్టముగ నుండెను. మఱొక్కప్రక్క ముండ్లపొదలును, సాంద్రమైన పొదరిండ్లును నెడ తెగనివై యుండెను. మధ్య నొక్కరొక్కరు మాత్రము పోవుటకు దారియుండెను. రాయ లాదారిఁబడి సేనలను నెట్లో నడుపుకొనివచ్చుచుండ నడుగడుగునను గజపతిసేన లెదు రొడ్డుచుండినవి. వానిని జయించుకొని ప్రయాణము సాగించుట రాయలకు దుస్తరమైయుండెను. శత్రుసేనలకడవి దారులు సుపరిచితములు. రాయలసేనకు కేవలము నడచు టయేకష్టము. అట్లయ్యును రాయలసేనలుత్సుకలుగాన నెదిరిబలమును నుగ్గునూచము గావించి ముందునకు సాగు చుండెను. రాయలు సేనలతో కటకపరిసరములకరుగునప్పటికి పదాఱుగురు పాత్రులును రాయల యాహార పదార్థముల నరికట్టిరి. సేన లడవిదారులంబడి నడచిన బడలికలు వాయ భుజించుటకైనను నాహారపదార్థములులేని దుర్గతిపట్టినది. ఏ ప్రక్కకుఁ బోవుదమన్నను జుట్టును పాత్రులబలమే.

సమరమునలిపి పాత్రులనోడించి యాహారపదార్థముల వశము జేసుకొందమన్నను సేనలకు గాసంతయైన నోపిక లేకుండెను. రాయలకు మనసులో మనసు లేదు. "అప్పాజీ! మీహితోపదేశము చెవినిఁబెట్టమైతిమి. దాని ఫల మనుభవిం

చితిమి. గజపతియే మహాబలవం పికపట్టుడు, ఇంక మీరు
గురుపాత్రు లొక్కటియై వేఱు
యైనప్పుడు మీరు లేకుండ నేము
తిమా? మీ రదనపు సేనల గొనిరా
మీరున్న సంతసించి యుందుమే? బుద్ధిపూర్వకము లేచెను,
లను మేమెడ గావించుకొంటిమి. నేటికి రాయలబుద్ధి మంద
బుద్ధియైనది" యని పరివిధముల రాయలు తలపోయు
చుండెను. తిమ్మరుసు రాకకై దారులు కాచికాచి రాయల
కన్నులు కాయలుకాచెను. తిమ్మరుసు నామము రాయలకు
సహస్రగాయత్రి యయ్యెను.

ఇంతలో నొక్కదిక్కునుండి కాఱుమబ్బులు క్రమ్ము
కొన్నట్లు లఖండసైన్యములు కదియవచ్చెను. "అవిపాత్రుల
సైన్యములై యుండబోలు. సన్నద్ధముగండ"ని రాయలు
గంభీరస్వనము గావించెను.

సైనికులెల్ల కత్తులు ఝళిపించి, బొమ్మలు విఱిచి,
బాఱులుదీర్చి యుగ్రులై నిలువబడిరి. రాయలకన్నులు
జేవురింతలకుఁ దొడఁగెను.

మూరురాయరగండనికి జయము! ఆంధ్ర సామ్రాట్టు
నకు జయము! అని మిన్నుముట్టు జయధ్వానములు
రాయల చెవిసోకెను. అంతలోనే యాసేనల నడుమనుండి
తిమ్మరుసు ముందునకు వచ్చెను.

రాయయలఁ బ్రాణములు లేచివచ్చెను. "అప్పాజీకి
నమస్కారము" లని పలుకుచు రాయ లెదురేగెను.

దేవరవారి సేనలన్నియు నేవీ? తగ్గినట్లు గాన్పించెడి నేమి!" యని మహామంత్రి ప్రశ్నించెను. గజపతి సేనలు తండతండములై వచ్చి మామార్గము నవరోధించి సేనలో కొంతభాగము నాహుతిగొన్నవి. తమ పలుకు మన్నింపని దోసమునకు ఫల మనుభవించితిమి. అవిగో! శాత్రులసేనలు! చుట్టును గాచియున్నవి. మన యాహారపదార్థములు వెనుక చిక్కుపడియున్నవి. మీరు తెచ్చిన సేనాపరివారమును గొని యరిగి పదార్థములు తెచ్చినతప్ప నీసేనలు తేఱికొన నేరవు" అని రాయ లాతురతదోఁప బలికెను. తిమ్మరుసు చిరునవ్వు నవ్వెను. "రాయలవారి యూహ సమయోచితముగాదు. ఆహారపదార్థములు తేఁగలిగినచో గజపతికోటను గైవసము చేసికొన్నట్లు. ఆ ప్రయత్నమున కిప్పుడు సమయముగాదు. మేమిప్పుడు నగరమునుండి దెచ్చినపదార్థములతో నీసేనలు తేఱికొనగలవు" అని తిమ్మరుసు బలికెను. రాయలు ఖిన్నుఁ డయ్యెను.

రా—మీరు తెచ్చిన యాహారములు సేనలకన్నిటికి బంచ వలసి వచ్చినచో నెన్నిదినముల కవి సరిబడగలవు? మన ముట్టడి సమాప్తమగు నంతవఱకు సరిపోగలవా?

తిమ్మ—ఏల ముట్టడింపవలయును? ముట్టడించినను మన కిప్పుడు కటకము చిక్కనేరదు.

రా—అగుచో రాయ లసమర్థుఁ డప్పాజీ?

తిమ్మ—సింహకిశోరము భీతిల్లుచున్న దేమి? "మీరు కత్తి యెత్తబనిలేదు. గజపతిని దేవరవారిపాదముల చెంతకు

దెత్తుము. ఒక్క దిన మోపికపట్టుడు. ఇంక మీరు విశ్రమింపుడు".

అని పలుకుచు తిమ్మరు సందుండి చివాలున లేచెను. ఆ మహామంత్రి శపథముతో నేకాగ్రమైన నిశ్చయభావము మాఱుమోగెను. కొన్ని యడుగులు నడిచి యేకాంత మరసి తిమ్మరు సొక్క రాతిబండపై గూర్చుండెను. ఆలోచ నామగ్నమైన యాతని చూపులకుఁ బ్రపంచమెల్ల గైవస మయ్యెను. ఉంకించి యొక్కసారి తిమ్మరుసు తలయూచు నంతలో రాజ్య తంత్రజ్ఞానము కనల బాఱెను ఒక కొంత సేపటికి తిమ్మరుసు తొగరు పెదవులపై ముసి ముసి నగవులు తొలకరించెను. ఇంతలో నాయన హృదయము నెఱిఁగిన గూఢచారి యాయనచెంత కేతెంచి నమస్కరించి నిలి చెను. తాళపత్రములు గంటమును దెమ్మని మహామంత్రి యాజ్ఞాపించెను. వేగులవాఁడవి తెచ్చి యిచ్చెను. తానా పత్రములఁ గొంత వ్రాసి సమీప వర్తులగు లేకరుల బిలిచి తిమ్మరుసు తన వ్రాత ననుసరించి పదాఱు లేఖల వ్రాయుఁ డని నియమించెను. ఈలోపుగ గ్రొంబట్టు దువ్వలువలు కొన్నియు, రత్నాభరణాదులు కొన్నియు, నొక్కొక్క పెట్టెలో నింపించి వేగులవానిచే పదాఱు పెట్టెలు సిద్ధపఱ పించెను. లేకరులు వ్రాసిన యుత్తరము లొక్కొక్కటి

యొక్కొక్క పెట్టెలోనుంచి తాళములు వేసి, రాయలవారి ముద్ర లుంచి వేగులవాని చెవిలో తిమ్మరు సేదియో నూ దెను. గూఢచారి పెట్టెలు గొని బయలుదేఱెను.

## III

అది రాజ సభ. సాయుధులై నిలువబడిన సేనానులు నడుమలనుండి వ్రేలాడు కత్తులపై చేతులాన్చి చక్రవర్తి వంకఁ జూచుచుండిరి.

"నేనును నా యనుచరులును ప్రాణములు పోవుదనుక మిమ్మనుసరింతుము, కాదేని, తెగవేయుఁడు" అని యొక మహావీరుఁడు శపథము చేయుచుండెను. ఇట్లే వీరు లనేకులు సంగరమునకు ప్రాణము లొడ్డువలుకులతో సభయెల్ల దద్దరిల్ల జేయుచుండిరి.

మాండలిక ప్రభులు, మహామంత్రులు, రాజబంధువులు నెల్లరును ప్రతాపరుద్ర గజపతిమహారాజు సింహాసనమునకు నలువైపుల నుచితాసనముల గూర్చుండిరి. రాజు రాజసమొలుకు దృక్కులతో సభయెల్ల నవలోకించుచుండెను.

ఒక రాజసేవకుఁడు తటాలున సభాద్వారమున నడుగు పెట్టి, "దేవవారికి జయము జయము. సభాప్రవేశమున కాజ్ఞయా ?" యని యడిగెను. "అవశ్యము" అని గజపతి ప్రత్యుత్తరమిచ్చెను. సేవకుఁడు మరలి వెనుకకరిగి వచ్చి మఱొక్కని వెంట నుంచికొని సభ ప్రవేశించెను.

"వీని నామము సంకల్పసిద్ధియఁట. వీఁడీ పెట్టెలుగొని పోవుచు దొరకినాఁడు. ఈపెట్టెలపై కృష్ణదేవరాయలముద్ర లున్నవి. మేనుగాయములు చేసినను, వీఁడు నిజము చెప్పినాడు కాడు. తుదకెట్లో యదార్థము బయటపడినది. కృష్ణదేవ రాయలనుండి పాతు్రిలయొద్ద కరుగుచున్నవాఁడఁట. ఎంత యత్నించినను దక్కినవివరము లెంతమాత్రము దెలియలేదు. ఇవిగో వీనియొద్ద దొరికిన పేటికలు పదునాఱును."

అని రాజసేవకుఁడు పెట్టెలను ప్రతాపరుద్రగజపతి ముందునిడెను.

గజపతిమహారాజు మంత్రివంకఁ జూచెను. మంత్రి లేచి ముందునకరిగి, పెట్టెలపైభాగములు పరీక్షించి "అవును, ఇవి యచ్చముగ శ్రీకృష్ణదేవరాయల ముద్రలే! ఇందులకు సంది యము లేదు" అని పలికెను, "తెఱచిచూడుము" అని గజపతి వాక్రుచ్చెను. మంత్రి పెట్టెలన్నియు బగులగొట్టించి చూచెను. 'రత్నాభరణములును, విలువగలవస్త్రములును, నిందున్నవి. ఇదిగో ఉత్తరముకూడ నున్నది' యని యొకపెట్టెలోని యుత్తరమును గొని తనలో దానే చదువుకొనెను.

మాండలికప్రభువు, శ్రీమంతు భలభద్రపాత్రునకు కర్ణాటక సింహాసనాధ్యక్షు శ్రీసార్వభౌమ మూరురాయర గండ శ్రీకృష్ణదేవరాయలు ప్రియమునవ్రాయు లేఖార్థములు. తమ లేఖాంశములు విశదమైనవి. మన యొడంబడిక ననుసరించి యీ యాభరణ దుకూలము లంపుచున్నారము,

అతనిం బట్టియిచ్చు భారము మీపై నున్నది. తుదిదాక పైకి బోకఁక మెలఁగుకొనుఁడు.

గ్రహింపుఁడు,
(ముద్ర) శ్రీకృష్ణదేవరాయలు.

మంత్రి రాజుదిక్కు దిరిగి "మహారాజా! పదునాలుగురు పాత్రులకును నిట్లే యీపెట్టెలన్నిటిలోను నుత్తరములుండి యుండును. లేఖాంశములు సభ చాలించినపిదప తెలుసుకోఁదగినవి" అని పలికి మిన్నకుండెను. రాజు "నేఁటిసభ ముగింతము" అని పల్కి లేచెను. మంత్రియు రాజు ననుగమించెను. సభ్యులు సెలవుగైకొనిరి. మంత్రి గజపతికి రహస్యముగ లేఖాంశములు వినిపించెను. మహారాజు ముఖము కళావిహీనమయ్యెను. శరీరము కంపించెను. ఆయనకేమియు దోఁచలేదు.

గజపతి—మహామంత్రీ! ఏమందువు?

మంత్రి—మాండలిక ప్రభువులు రాయలనుండి లంచములు గొని యింత స్వామిద్రోహము చేయుదురనుట నమ్మదగినది కాదు. పాత్రులు విశ్వాసపాత్రులు.

గజపతి—నిదర్శనముండఁగా సందియపడనేల?

మంత్రి—అవును. దీనింబట్టిచూడ సంకోచింప నక్కరలేదు. ఇట్టి భేదతంత్రములో దిమ్మరుసు మహామంత్రిని మించిన చేయిలేదు. మేకపిల్లను సింగపు గొదమను

నొక్క కొలనిలో నీరుద్రావించు నేర్పరి యతఁడు.
తల్లియొడిలోనిపిల్లను విడదీయు మహాతంత్రజ్ఞుడతఁడు.

గజపతి—అవును. తిమ్మరుసు లేక రాయలు లేఁడని గొప్ప ప్రతీతి. అగుచో ధనము గుప్పినచో దిమ్మరుసు వశ మగునేమో? మాయావిని మాయచేతనే నిర్జించ వలయునని రాజనీతి.

మంత్రి—అది దుర్ఘటము. మిన్నుమన్నేకమైనను మన సామ్రాజ్యము నెల్ల తిమ్మరుసునకు ధారవోసినను నాయన రాయలకెగ్గు దలపెట్టఁడు. రాయలకెగ్గే తలఁచినచో తిమ్మరుసిట్టి సామ్రాజ్యము లెన్నియో యార్జించియుండును. కాని యాయన యాదర్శములు మానవ ప్రకృతి కతీతములు.

గజపతి—పాత్రులెదిరింగొలిచి నిలిచినప్పటికిని మనము పౌరుషముతో నిలిచి యని సేయుదమా? చేసిన గెలుపు సాధ్యమా?

మంత్రి—అది కల్ల, మనకాధారమెల్ల పాత్రులే. వారు లేనిది మనకు గెలుపురాదు.

గజపతి—అగుచో, మనమిప్పుడు పాత్రులనే పిలిపించి ధనములుగుప్పుదమా? పాత్రులు రాయలకువశమగుటయు నీమార్గముననేగదా? అదియే యవలంబింతము.

మంత్రి—మన మింతవఱకు వారికి ధనములిచ్చియు సాయములుసేసియు, మనుచుట లేదా యేమి? ఎంతధనము గుప్పినను వారంతియే, వారినెప్పటికిని నమ్మరాదు.

ఈ జాబులో వ్రాయబడినట్లు వారు నిక్కముగ తుది దాక పోక్కరు. వారిది నమ్మకపు స్వామిద్రోహము.

గజపతి—నిక్కమే. నేఁటికిని వారు చూపు నక్కవినయము లెంత మోహజనకములు? అగుచో,ఏమిచేయుదము?

మంత్రి—రాయలనే శరణమందము. గత్యంతరము కాన రాదు.

గజపతి—ఎట్టి న్యూనత వాటిల్లుచున్నది? రాజరాజున కిది శోచనీయము.

మంత్రి—సార్వభౌమా! సమయము ననుసరింపవలయును. లేకున్న నింతకన్న ప్రమాదము సంభవింపదా?

గజపతి—అగుచో, తొలుతనే మనము శరణమన్నచో వినుకొండ మొదలగు సీమలన్నియు మనము కోలు పోకుందుమే?

మంత్రి—అప్పుడింతో యంతో జయకాంక్షయున్నది. నాఁడు మనకున్న పాత్రిలబలము మనకట్టిధైర్యము నొసంగి నది. ఇప్పుడాయాశ సంపూర్ణముగఁ దీఱినది. కాన మనకు శరణమే శరణ్యమయినది.

గజపతి—అయినచో, రాయలు శరణమిచ్చునా?

మంత్రి—రాయలు రణధర్మము లెఱిగిన మహావీరుఁడు;కోరిన వారికి దప్పక శరణమిచ్చును.

గజపతి—తిమ్మరుసది యామోదించునా?

మంత్రి—తన రాయలకు సార్వభౌమపదవి నెలకొల్పుటయె

తిమ్మరుసునకు ముఖ్యము కాని మీాపైన నేమైన కసి యుండునా ?

గజపతి—అగుచో, నాలస్య మెందులకు? దానికి వలయు పద్ధతిని గణుపుము. 'శరణ మిచ్చుటయగాని కొనుట మన మెఱుగము. ఏమిచేయుదము? విధి బలాఢ్యుఁడు' అని గజపతి మహారాజు వాక్రుచ్చెను.

ఇంతలో నొక్క సేవకుఁడు ప్రవేశించి "దేవరకు జయము ఇదిగో" అని యొక లేఖను మంత్రిచేతి కందించి యరిగెను. మంత్రి దానిని విచ్చి చదివికొని "అమ్మయ్యా! రాజ్యలక్ష్మికి ప్రాణము దక్కినది. మహారాజునకు మానము దక్కినది. అని యొక్క నిట్టూర్పు పుచ్చెను. 'ఎక్కడ నుండి? విశేషము లేమి?" యని గజపతి యాతురుఁడై ప్రశ్నించెను. "తిమ్మరుసు మహామంత్రులవారినుండి. నేటి సాయంతనము లోపుగవచ్చి సంధిషరతులు దేల్చుకొనినచో మీారాజ్యము మీాకు దక్కును. కానిచో రేపే రణము ప్రకటింతుము" అని యిందలి విశేషములని మంత్రి పలికెను. గజపతి ముఖమునఁ దిరిగి తేజము తెకొ్కనెను.

గజపతి—ఏమి? మహామంత్రీ! తలఁపులోనే దైవము ప్రత్యక్షమై శత్రువును శరణమను నీచతను దప్పించినాఁడు. ఇక మనము రాజసముతో వరిగి సంధి కుదుర్చుకొన వచ్చును. సంధికార్యము రాజులకు సహజము. సమం జసముగూడను—ఎట్లుపోవుదము? కీడెంచి మేలెంచ

వచ్చెను. సేనా సమేతులమై పోకున్న ముప్పు వాటిల్లునే ?

మంత్రి—సేనల గొనిపోవుట సంగరసూచన. మన మరుగునది సంధికార్యమునకు. రాయల మనస్సు సంధికున్ముఖము. గానిచో మన కీ యుత్తరమే వ్రాయింపడు. సమరమే ప్రకటించియుండును.

గజపతి—అగుచో వారు పాత్రుల సేల చీలదీసిరి ?

మంత్రి—లేకున్న మీరు సంధి షరతులకు వత్తురా ? అందులకే చీలదీసిరి.

ఈ సంభాషణముతో ప్రొద్దు వాలెను. గజపతి మహారాజును, మంత్రియు, సేనానియు, నశ్వము లవరోహించి బయలు దేఱి యరణ్యముప్రవేశించిరి. నలుప్రక్కల రాయల సేన లనంతములై కానిపించెను. గజపతి యదిచూచి మంత్రి సత్తమునితో, 'పాత్రులు లేకుండగనే రాయ లీసేనతో జయము గొననోపువాఁడే. చూడు వీ సేనా ప్రళయసాగరము' అని రిచ్చపడి పలుకసాగెను. "అవును, అది యట్టిద. సంధి కలిసితానిచో, నేఁడైన మన రాజ్యము మనకు దక్కుట కల్ల" అని మంత్రి పలికెను. రాయలసేన లుక్కు తునకలని ప్రతీతియని సేనాని పలికెను. ఇట్లనుకొనుచు వారు శిబిర పంక్తిదాపునకు వచ్చిరి. "రాయలవారి శిబిర మెక్కడ?" అని గజపతియొక్క ఫణిహారినడిగెను. ఆఫణిహారి వీరిని తేఱి పాఱజూచుచుండెను. "మహామంత్రులవా రెందున్నారు? అని మంత్రిసత్తముడు వానిని తిరిగి ప్రశ్నించెను.

"సంధియా? – సమరమా?" యని యా ఫణిహారి యఱచి కత్తిఝళిపించెను. మంత్రిసత్తముఁడు 'సంధి, సంధి' యని బదులు చెప్పెను. ఫణిహారి నమస్కరించి 'ఇదియే రాయలవారి శిబిరము. ఇందే మహామంత్రులవా రున్నారు" అని ప్రతివచనమిచ్చెను. వీరు లశ్వములు దిగి నిలిచిరి. ఇదివిని శ్రీకృష్ణదేవరాయలు మంత్రిసహితుఁడై శిబిరము వెలికి వచ్చి వికసితాననముతో గజపతిని గౌఁగిలించుకొనియెను. తిమ్మరుసు మహామంత్రి నూతనాగంతుకుల కుశల సంప్రశ్నములు గావించి శిబిరములోనికి గొనిపోయెను. రాయ లనుగమించెను. ఎల్లరును నుచితాసనముల నాసీనులైరి.

తిమ్మరుసు—మా లేఖ గజపతి మహారాజుగారి కందినదా (అని మంత్రివంక చూచెను.)

మంత్రి—ఆ. అందినది, మీయాదరమునకుఁ గృతజ్ఞులము.

తిమ్మరుసు—గజపతిమహారాజుగారు శ్రీకృష్ణదేవరాయలవారితో బంధుత్వము గలిపికొన్నచో కర్ణాట కళింగ రాజ్యముల యైక్యము శాశ్వతమగును గదా యని నాయాశ.

మంత్రి—నిక్కము. మహామంత్రులవారూ? అది మా మహారాజునకు గౌరవదాయకము. (అని గజపతిదగ్గరకు దనయాసనము లాగుకొని కూర్చుండెను.)

గజపతి—(రహస్యముగా) మంత్రిసత్తమా! రాయలు సద్వంశజాతుఁడు కాదని లోకవాదము. (ఆలోచించి) కాని ఒప్పుకొనక తప్పదుగదా? సరే యనుము.

వలెను. సేనా సమేతులమై పోవున్న ముప్పు వాటిల్లునే ?

మంత్రి—సేనల గొనిపోవుట సంగరసూచన. మన మరుగునది సంధికార్యమునకు. రాయల మనస్సు సంధికున్ముఖము. గానిచో మన కీ యుత్తరమే వ్రాయింపడు. సమరమే ప్రకటించియుండును.

గజపతి—అగుచో వారు పాత్రుల సేల చీలదీసిరి ?

మంత్రి—లేకున్న మీరు సంధి షరతులకు వత్తురా ? అందులకే చీలదీసిరి.

ఈ సంభాషణముతో ప్రొద్దు వాలెను. గజపతి మహారాజును, మంత్రియు, సేనానియు, నశ్వము లవరోహించి బయలు దేఱి యరణ్యముప్రవేశించిరి. నలుప్రక్కల రాయల సేన లనంతములై కానిపించెను. గజపతి యదిచూచి మంత్రి సత్తమునితో, 'పాత్రులు లేకుండగనే రాయ లీసేనతో జయము గొననోపువాఁడే. చూడు వీరాసేనా ప్రళయసాగరము' అని రిచ్చపడి పలుకసాగెను. "అవును, అది యట్టిద. సంధి కలిసిరానిచో, నేఁడైన మన రాజ్యము మనకు దక్కుట కల్ల" అని మంత్రి పలికెను. రాయలసేన లుక్కు తునకలని ప్రతీతియని సేనాని పలికెను. ఇట్లనుకొనుచు వారు శిబిర పంక్తిదాపునకు వచ్చిరి. "రాయలవారి శిబిర మెక్కడ?" అని గజపతియొక్క ఫణిహారిసడిగెను. ఆఫణిహారి వీరిని తేఱిపాఱజూచుచుండెను. "మహామంత్రులవా రెందున్నారు? అని మంత్రిసత్తముడు వానిని తిరిగి ప్రశ్నించెను.

"సంధియా? — సమరమా?" యని యా ఫణిహారి యఱచి కత్తిఝుళిపించెను. మంత్రిసత్తముఁడు 'సంధి, సంధి' యని బదులు చెప్పెను. ఫణిహారి నమస్కరించి 'ఇదియే రాయలవారి శిబిరము. ఇందే మహామంత్రులవా రున్నారు" అని ప్రతివచనమిచ్చెను. వీరు లశ్వములు దిగి నిలిచిరి. ఇదివిని శ్రీకృష్ణదేవరాయలు మంత్రిసహితుఁడై శిబిరము వెలికి వచ్చి వికసితాననముతో గజపతిని గౌఁగిలించుకొనియెను. తిమ్మరుసు మహామంత్రి నూతనాగంతుకుల కుశల సంప్రశ్నములు గావించి శిబిరములోనికి గొనిపోయెను. రాయ లనుగమించెను. ఎల్లరును నుచితాసనముల నాసీనులైరి.

తిమ్మరుసు—మా లేఖ గజపతి మహారాజుగారి కందినదా

(అని మంత్రివంక చూచెను.)

మంత్రి—ఆ. అందినది, మీరాయాదరమునకుఁ గృతజ్ఞులము.

తిమ్మరుసు—గజపతిమహారాజుగారు శ్రీకృష్ణదేవరాయలవారితో బంధుత్వము గలిపికొన్నచో కర్ణాట కళింగ రాజ్యముల యైక్యము శాశ్వతమగును గదా యని నాయాశ.

మంత్రి—నిక్కము. మహామంత్రులవారూ? అది మా మహారాజునకు గౌరవదాయకము. (అని గజపతిదగ్గరకు దనయాసనము లాగుకొని కూర్చుండెను.)

గజపతి—(రహస్యముగా) మంత్రిసత్తమా! రాయలు సద్వంశజాతుఁడు కాదని లోకవాదము. (ఆలోచించి) కాని ఒప్పుకొనక తప్పదుగదా? సరే యనుము.

ఈసారి కీ ప్రయత్నము వదలి పోవుదము. మనము బలము మిగిలి, నిమయమెఱిగి యతని నిగ్రహింతము.

అమా — భీమసింహు డట్టివాడని నా కెఱుకయే! కాని వాని భార్య పద్మిని జగదేక సుందరి యనియు మీ రామెను గైకొనఁ గోర్కి గలదనియు నిదివఱకు తమరు తెలిపియుండిరి అందులకై నే నిట్లంటిని.

అల్లా — అవును సమయమునకు జ్ఞప్తికెలయుంచితివి. నే మామెను గైకొని తీరవలయును. కాని మేము రాణాను నిగ్రహించి యామెను సంపాదించుట కల్ల. ఒండొక తెఱఁగు నీవే యుపదేశింపుము.

అమా — పాదుషావారి పలుకు సమంజసము. ఒండొక విధమున నే కార్య మాచరణీయము. దండనీతి చివరిది. సామదానభేదోపాయముల తొలుత ప్రయత్నింతము.

అల్లా — సామమున మనకు ఫలించున దేముండును! "నీ భార్యను మా కర్పింపు"మని సామమున నే మడుగుట యొప్పిదమా? అతఁడది యొప్పుకొనుట యొప్పిదమా? ఈ రెండును సామమున జరుగదగినవి కావు. దాన మనునది సామాన్యుల విషయమున బ్రవర్తించును. ఈ దృశమైన రాజ్యాధినేతకు మన దానరాసులు తృణప్రాయములు. ఇఁక భేదమన్నచో ననుకూల దాంపత్యము నెడల నిరర్థకమైనది. ఈమూఁడును బ్రకృతమునకు సాధనోపాయములు గానేరవు.

మంత్రి – భీమసింహునెడల నివ్రబవర్తింపవని నే నెఱుఁగుదును. పద్మినీపట్లనే సాధనీయములు. స్త్రీహృదయము మెత్తనిది. ఏరీతి మలచిన నారీతి వంగును. రహస్యముగ రాయబారమంపి సామమున బోధింపింతము. అంగనల మనస్సు సౌందర్యమునకు వశమగును; గాన సుందరవస్తు సముదాయ దానముచే వింతఁగొలుపుదము. ఈ రెండుపాయములును నా దంపతులకు భేదము గొలుపుటలో బరిణమించును.

అల్లా – అమాత్యా! ఇది బాగుగనున్నది. ఇందులకనువగు రాయబారినిఁ బేర్కొనుము.

అమా – అంతఃపుర ప్రవేశమునకుఁ బురుషులు పనికిరారు. అట వనితలే తగినవారలు అదియునుఁగాక "బలం బలేన సాధితం" కాంతను కాంతయే కఱంచ గలుగును. అందునుబట్టి వ్యాపారమునందు దాసీజనులు తగుదురు. కాన నొక్క మగువను మణిభూషలిచ్చి పనుపుదము.

అల్లా – ఆలస్యము వలదు. పద్మిని పతివ్రతల కాదర్శమని ప్రసిద్ధి. ఆమె తన మనసు నొవ్వకుండ లోబఱచుకొను చాకచక్యముగల దాసినిజూచి మఱియుం బంపుము. ప్రయత్నము సఫలమగువఱకు మనమిచ్చట నే సేనలతో విడిసియుందము. అని పలికెను.

"చిత్తము! పని వినియెద" నని మంత్రి సత్తముండు బయలుదేఱి చనెను. అల్లాయుద్దీన్ ఆలోచనలో దిగెను.

ఆంధ్రత్వము జీవవంతమైనది. మీ భుజబలమునందే యాంధ్రదేశ ఖ్యాతి జోకొట్టఁబడుచున్నది. మీతోనే దేశమునకు, జాతికి, భాషకు, సంఘమునకు నవ జీవనోదయ మైనది.

రాయలు—పోనిండు ఇట్టి రాయల బ్రతుకెల్ల తిమ్మరుసు వారి కనుసన్నపై నాధారపడిన దండుము. అది యొప్పుకొనక దప్పదప్పాజీ! జన్మ శతముల కైన మీ ఋణము మేము తీర్చుకొనఁజాలము.

తిమ్మరుసు—మహారాజా! ఇది సేవక వృత్తి. నే కావించునది సేవక ధర్మము. ఇందంత ప్రశంసనార్హమైన విశేషము లేదు-పొద్దుపోయినది విశ్రమింపుడు. నే నరిగెదను" అని తిమ్మరుసు బయలుదేఱెను.

రాయలు విశ్రమించెను.



# పద్మిని

అల్లాయుద్దీన్ - అమాత్యా! ఆ కనబడు నగరమెద్ది?

అమాత్యుఁడు - అది చిత్తూరు. మీవారు రాజ్యమునకు రాజధాని.

అల్లా - ఱేఁ డెవరు?

అమా - ఱేఁడు మహారాణా లక్ష్మణసింగు. అతఁడు బాలుఁడు. అతని పినతండ్రి భీమసిం గిప్పుడు రాజ్యము బరిపాలించుచున్నాఁడు.

అల్లా - అటులనా? అతని నామము మాకు సుపరిచితము. అతఁడు మహారాణాలలో గొప్ప పేరుగల బిరుదు. ఈ నగరమున వెన్నెలకుప్పలవలె భాసించు హర్మ్యములు గాంచినంతనే వాని ప్రభావము కన్నుల గట్టినట్లున్నది. మన ఢిల్లీ నగరమును గూర్చిన గరువము నాకు నేటితో సమసిపోయినది. ఇప్పటికి మనము వశము గావించుకొన్న యుత్తర హిందూస్థాన మంతటిలో నీపాటి నగరము లున్నవా యని సంకోచము కలుగుచున్నది.

మంత్రి - అవును. అది నిజము. పాదుషావార లీరాజ్యము గూడ జయించినచో శ్రీవారి కీర్తి షోడశ కళా పూర్ణము గాగలదు.

అల్లా - కాని భీమసింహుఁడు సార్థక నామధేయుఁడు. అతని గూర్చి ననుబోలె నీ వెఱిగియున్నచో నిట్లాడియుండవు

మంత్రి—గజపతి మహారాజుగారిది ప్రశంసించుచున్నారు.

తిమ్మరుసు—(శ్రీ)వారి కొమరిత 'తుషారమణీ మణి కర్ణాట రాజ్య పట్టమహిషి కాబోవు కళలతో వెలయుచున్న దని వినికిడి. ఆమె రూప రేఖావిలాసములు రాయల హృదయ ఫలకముపై నిలిచిపోయినవి కూడను. ఈ మా పరివారము పరిణయోత్సవ పరివారముగ మాఱవలయునని మా యూహ.

గజపతి—(మూర్ఛపడి) "దుర్బుద్ధీ! శత్రువునకు గొమరిత నిచ్చు కూర్రుని(గ సలుపదలంచితివా గజపతిని— (ఇంచుక విచారించి) ఒకటిలో దల దూర్చితిమి. ఒకటి పోటునకు వెఱవనేల? సరే కానిమ్మనుము. (అని మంత్రితో రహస్యముగ బలికెను.)

మంత్రి—మహామంత్రులవారెట్టి ప్రశంసనీయమగు నూహ గలిగినారు? కృష్ణదేవరాయలవంటి మహారాజునకు, రసికునకు, భార్య కానోపిన మా రాజకుమార్తె ధన్యతమురాలు.

తిమ్మరుసు—ఆ మహారాజ్ఞి యొకపై జక్రవర్తిని. రాయలు చక్రవర్తి. గజపతీంద్రుడు సామంత రాజవతంసమై యల్లునకు గప్పము లప్పనము సేయుచుండవలయును.

మంత్రి—(తనలో మా మహారాజున కెట్టి న్యూనత సంభవించుచున్నది. (గజపతి వంకకు తిరిగి) "రాజా! ఏ మందము" అని రహస్యముగ నడిగెను.

గజపతి—"ఏమందము. సరే యందము" అని మంత్రిచెవిలో బలికెను.

మంత్రి—(ప్రకాశముగ) అల్లురకు గాళ్ళు కడుగుటతోడనే వారికి మామూలు సామంతు లగుదురు. ఇందు క్రొత్త యేమున్నది? మామహారాజు దానిని మిగుల యొప్పిద మనుచున్నవారలు.

తిమ్మరుసు—(నవ్వి) కాదా మఱి?—"ఇదిగో సంధిపత్రిము. దీనిపై బ్రహ్మాపరుద్రులవారు ముద్ర నునుచ బ్రార్థన. అనిపత్రిము నందించి ముద్రింపించి కైకొనెను. తిమ్మరుసు కోరికపై గజపతీంద్రుఁడు, మంత్రి, సేనానియు నాఁడట విందులు గుడిచి చనిరి.

రాయలు—అప్పాజీ! ఇదియెల్ల విడ్డూరము గొలుపుచున్నది. నిన్నటి యుదయమున మా స్థితి యేమి? నేఁటి యీ పరివర్తనమునకు గారణ మేమి?

తిమ్మరుసు—విధిబలము — రాయలవారి సంకల్పబలము.

రాయలు—అప్పాజీ! మేధాబలము కాదా? అప్పాజీ లేని రాయ లెట్టివాఁడో నిన్న తెలిసినది. అప్పాజీ గల రాయ లెట్టివాఁడో నేడు తెలిసినది.

తిమ్మరుసు—రాయలవారు పొరబడుచున్నారు. రాయలు లేని తిమ్మరుసు మాత్రిము నిరర్థకుఁడు కాడా! తావి లేని పూ వెందులకు? ఇనరశ్మి లేని రతన మెందులకు? మీ రసికత మీఁదనే యష్ట దిగ్గజముల యంద చందము లాధారపడినవి. మీ యాదర్శములోనే

"ఉత్తర హిందుస్థానమంతయు మాకు వశమగుట యొక్క యెత్తు; పద్మినీ దేవి పట్టుబడుట మఱొక్కయెత్తు. కామినియై యిట్టి సామ్రాజ్యమునకు రాజ్ఞిగాఁదలచునో! పతివ్రతయై మాన సంరక్షణమునం దభిమానము వహించునో! ఇది యిప్పుడు తేలవలసియున్నది.

అంగీకరింపనిచో ఆలము దప్పదు. అంగనకై యధర్మ యుద్ధమున దిగి జననాశము గావించుకొనుటయా? లేక యాం తలఁపే వదలి యూరక మగిడిపోకయా? ఏది యొప్పిదము? (ఆలోచించి) దాసిని బంపుటతో గార్యరంగమున నొక్క యడుగు వేసితిమిగదా! ఇఁక బద్మినినుండి ప్రతికూల వచనము వచ్చినతరువాత ఢిల్లీ పాదుషా తలవాల్చుకొని తిరిగి పోవుట యధమకార్యము. ఉచితమునకో, యనుచితమునకో యొగ్గితిమి. ఇది సాధించి తీరెదము."

అని అల్లాయుద్దీన్ విమర్శించుకొనుటతో నా తేయి గడచెను.

అంత మంత్రిపుంగవుఁడు ప్రవేశించి "పాదుషావారికి జయము. దాసి తిరిగివచ్చినది. ప్రయత్నము ప్రతికూలమైనది. కర్తవ్యమాదేశింపుఁడు" అని కోరెను. ఆఁడదివిన్నతోడనే యప్పటి ప్రాగ్దిశలోని యరుణకాంతితో ఢిల్లీ పాదుషా ముఖకాంతి మైత్రి నెఱపెను. ఆయన కన్నులలో రెండు భాను మండలము లుదయించెను. "నేఁడే రణము. చిత్తూరుకోట వల్లకాటిదిబ్బ కావలయు. పద్మిని పాదుషాకు వశము గావలయు. లేదా మీప్రాణములు చిత్తూరున కర్పింపవలయును,

సన్నాహము సల్పుచు వచ్చుచున్నా” మని అల్లాయుద్దీను మండిపడి యఱచెను. మంత్రి వణకిపోయెను. మంత్రిసత్తముడు పని విని సేనాప్రవాహమును జిత్తూరుపైకి ద్రిప్పెను.

II

భీమ - దేవీ! కార్యము మించి వచ్చినది. ఈ మాఱు కూడ జయము పాదుషానే వరింపనున్నది. కడచిన యుద్ధములో మనకు బ్రాప్తించిన యపజయము సందర్భమున ధనరాసులు లంచములిచ్చి చిత్తూరునురక్షించుకొంటిమి. ఈసారి యాప్రయత్నము విఫలమైనది. “ఈ మహారణము .పద్మినికొఱకుగాని, సొమ్ములు కొఱకు బడిగాదు” అని యామ్లేచ్ఛుడు పలికి ధనములు ద్రిప్పి వేసినాడు.

పద్మిని—ఈపని నేను మున్నే కావించితిని. దాసి రత్నాభరణములు దెచ్చి నా మనసు వశముచేసుకొన దలచి నప్పుడు నే నాయాభరణములు ద్రిప్పికొట్టలేదా ?

భీమ—నీవది కావించుటలో బాతివ్రత్యమున్నది. అతడది చేయుటలో పరకాంతాభిలాష యున్నది.

పద్మిని—అయ్యో! చిత్తూరులక్ష్మి యీరెండు యుద్ధములతోనే కళదప్పి నిలిచియున్నది. ఈగండము గడచి ఈమె యెప్పటికేని శాంతమున మనకానందము నొసగునేమో యని యాసవహించి యుంటిని. అదియును, వమ్మయినదా? ఇది దుర్భరము.

భీమ—కాని యది తప్పుట కొకమార్గము దొరకినది. “పద్మిని నొకసారి చూపినచో జిత్తూరును వదల

గలిగినని యతఁడు రాయబార మంపినాఁడు. అది యంగీకరించుటకు సిగ్గై ప్రత్యుత్తరమీయక మే మిటు వచ్చితిమి.

పద్మిని—పాదుషా కంటబడి పద్మిని పాప పంకిలము కానో పునా? ఇది జరుగనేరదు.

భీమ—తొలుత మేమును నట్లేతలఁచితిమి. నేఁటివఱ కదృష్ట దేవతకు దూరగులైనను, రసపుత్రులు మానరక్షణ మునఁ గొఱఁతవడు కర్మము పట్టలేదు.

పద్మ—ఎప్పటికినిఁ బట్టఁబోదు.

భీమ—కాని నేటికి పాదుషా వ్యాజమున నది కలుగనున్నది. నిన్నా తుచ్ఛుఁ డవలోకించుట కేని మన మంగీకరింప నిచో మన కాసన్నమగు ప్రమాదము లూహించుట కైన భయంకరములు. వంశానుగతమై మనకు కీర్తి తెచ్చు చిత్తూరు పురలక్ష్మి పాదుషా పాద తాడన మును బొందుటయొకటి. అంతఃపురకాంతల మాన ప్రాణములకు హానిసంభవించుట యొకటి. ఇంకను దలపఁగూడని చెట్ట చెయిదము లెన్నియోనిఁ గలవు. నిన్నతఁడు చూచిపోవునట్టి కొద్దిపనితో నీప్రమాద ములు కడవవచ్చును గదా యని నా యాస.

పద్మిని—రసపుత్రులు పరాక్రమ జీవనులు గాన, నిప్పుడుగా కున్న నెప్పుడైన పాదుషానుండి స్వరాజ్యమునుసంపా దించుకొనలేకపోరు. కాన రాజ్యము వానిదగుటకల తప్పినప్పినచో జాతికాపాలుటి యగుటకై నే నిదివఱకే

కాంతల నాయిత పఱచితిని. కావున మా మాన
సంరక్షణమునకు భంగ మేనాఁటికి గలుగఁబోదు. మే
మట్లు ప్రాణములు గోల్పడినచో నతనికి నాదర్శన
మైనలభింపదని యేకదా తానీనగరమున జయమొంద
గలిగియు నిట్టి సంధి రాయబార మంపినాఁడు.

భీమ – అది నిజమే కాని గోరఁ జిదుమఁ దగిన యల్పవిషయ
మును గొట్టంటఁ బగుల వేయనేల? నిన్ను జూపినఁ
జాలు. రాజ్యము దక్కును మానమును దక్కును.
ఇందులకే సిగ్గిలుచు నిన్ను గోరుచున్నాము.

పద్మిని – అగుచో నా పాపికనుపాపలలో బద్మిని ప్రత్యక్ష
ముగ నిలువ వలెననియా రాణావారి తలంపు.
చిత్తూరు రాజేశ్వరి కెట్టి తలవంపు!

భీమ – పోనిమ్ము. నీ ప్రతిబింబము నొక్క ముకురమున
గాంచి యతం డరుగుగాక! రసపుత్రుఁడనై మీవారు
రాజ్యమునకు మహారాణానై సతీమణిని బరపురుషు
నకు, అందునను దురుష్కునకుఁ జూపింప నొప్పు
కొనుచుండగా నీకీ సందియమేల తల్లీ!

అని భీమసింహుఁడు పద్మిని మనమును బహు ప్రయ
త్నమున నొడంబఱచెను. అనంతరము పాదుషా రాయ
బారిని బిలిచి భీమసింహుఁడు తన యంగీకారమునుఁ దెలిపెను.
అది విని పాదుషా స్వల్ప పరివారముతో భీమసింహుని
మందిరమున కెక్కలు కట్టుకొని వ్రాలెను. తెర మఱుగున

పద్మిని రమణీయ భీషణాకృతితో నిలిచెను. పాదుషా యొక రుడు మాత్రము తెరయీవలి కడుగు పెట్ట ననుమతింపబడెను.

తోడనే పద్మిని భీమసింహుని తెరచాటునకుఁ బిలిపించెను. "పాదుషా వంటయింటి కుందేలైనాడు. మోసమును మోసముచేతనే భజింపవలయును. వాని రక్తమును జవి చూచుటకై నాకటారు కదలువారుచున్నది. పాదుషాతోడి యొడంబడికకు నిచ్చగించిన వారలు మీరు గాన మీ యనుమతి వేడుచున్నదాన" అని పద్మిని ప్రాణేశ్వరునిఁ బ్రార్థించెను.

భీమసింహుఁ డొక ఱాయివోలె నిలిచెను.

భీమ – సుందరీ! అధర్మము నే యిచ్చగించుచో రసపుత్రుల కెన్నఁడో ప్రపంచమెల్ల వశమయి యుండెడిది. ఇట్టి యవకాశములు మన పూర్వుల కెన్నియో లభించినవి కాని వారి కాత్మగౌరవ మడ్డుతగిలినది. ధర్మమార్గము దారితీసినది. మే మావంశమునఁబుట్టి వారి కీర్తికిఁ గళంక మాపాదింతుమా!

నిన్నతఁడు చూచుటకు మన మియ్యకొనుటయే యొక మచ్చ యనవచ్చును. ఈ సందర్భమున నితని నిట్లు గావించినచో చరిత్రలలో మనయపకీర్తి మఱియు నాయతమై పోదా? వలదు! రసపుత్రవంశమునకు గళంకము నాపాదింపవలదు" అని భీమసింహుడు వారించెను. పద్మిని యుద్రేకము నిరాలంబమయ్యెను.

తుదకామె యెట్లో మకురమున కెదుటనిలిచి ముకు
ళితముఖయై లోనికరిగెను. జగన్మోహనమగు పద్మిని రూపలా
వణ్యములు నిలువుటద్దమునఁజూచి పాదుషా మోము వికసిం
చెను. అతఁ డుత్సాహముతో మందిరము వెలువడెను. భీము
సింహుఁ డవనత వదనుఁడై పాదుషాను వెంబడించెను.

"మహారాణావారు మాకిఁక మిత్రులుగాన మా
శిబిరమున కరుదెంచి మాకు విందై చనినచో బరస్పరమైత్రి
బిగువు కాగలదు" అని అల్లాయుద్దీను పలికి రాణాను వెంట
గైకొని పోయెను.

III

భీమ – మోసము! మోసము! ఢిల్లీ పాదుషా కిది తగనిది.
ఒండొక మగనాలిపై మరులుగొని రణమునకు దిగు
టతో మీ యుధర్మము మొలకెత్తినది. కుటిల
మతులై నమ్మించి విందని పేరుపెట్టి పిలిచి యొంటరి
జేసి చుట్టుముట్టుటతో నధర్మము పండిపోయినది.
అల్లాయుద్దీను పాదుషావారి కిట్టి దొంగతనము
హేయమయినది. తప్పిదులైన మీరే మా మంది
రమునఁ జిక్కినప్పుడు వదలివుచ్చినట్టి మమ్ము
మోసమునఁ జెఱబట్టుట మహాపాపము.

పాదుషా – ఈ ధర్మపన్నములతో మాకు బనిలేదు. పద్మిని
నొసంగెదవా? లేక ప్రాణముల గోలుపోయెదవా?
తేల్చి చెప్పుము. చేయికాలిన మీదట నాకులకుఁ
దడవనేల?

భీమ – ఆలిని శత్రువునకు చేతులార నిచ్చుటకంటె ప్రాణము
లర్పించుట రసపుత్రులకు గౌరవప్రదము. నన్ను
మీ యిచ్చవచ్చినరీతి కావింపుఁడు; కాని యిందుచే
మీకుఁగలుగు ఫలము సున్న. పద్మిని శరీరమును
స్పృశించుట కలలోనిమాట.

పాదుషా – అటులనా! ఇప్పుడే చిత్తూరునుండి వార్త వచ్చి
నది. పాపము! నీ ప్రాణముల రక్షింపఁదలఁచి పద్మిని
నన్నుఁజేరరా సమ్మతించినది. ఏఁడువందలమంది
చెలికత్తియలు వెంటగొలిచిరా ఢిల్లీ రాజ్యలక్ష్మికిఁ
గాబోవు సహపత్నియై యామె వచ్చుచున్నదఁట.
నీ మన మెఱుఁగఁగోరి యిట్లిపుడు ప్రశ్నించితిమి
గాని కార్యమెల్ల కరతలామలకమయినది. ఇఁకపై
రసపుత్రాంగనల మానరక్షణములఁ గూర్చి యుప
న్యాసములు కట్టిపెట్టుము" అని పలికి పాదుషా
యుత్సాహముతో చెఱసాల వదలి వెలి కరిగెను.
సేవకులు ద్వారము మూసి తాళములు బిగించిరి.

భీమసింహుని మన మాందోళనములో మునిగెను.
"పద్మినియా? పాదుషాను తనకు తానై కోరివచ్చుటయా! ఇది
యసంభవము. ఏకాంతముగా పాదుషా గడీకండలు గోయ
నెంచి మాయనుమతిలేక వెనుకాడిన పద్మిని, నా యర్ధాంగ
లక్ష్మి యట్లొనర్చునా? దీనిలో నేదో మిషయున్నది. అవును
వున్నది. ఏడువందల చెలికత్తెలు వెంటవచ్చుచున్నారఁట!
మాయంతఃపురముననున్న కాంతల నందఱ లెక్కించినను నీ

సంఖ్యాపూరణముకాదే? అట్టిచో నీవింత యేడ?" అని భీమ సింహుఁడు తలపోయుచుండెను. ఇంతలో గవాటములు తెఱ వఁబడెను. అల్లాయుద్దీను హర్షపులకితుఁడై ప్రవేశించి "ఇంక నీవు చిత్తూరుతోవను వెదకుకొనవచ్చును. పాదుషాకు పద్మినీ దేవి వశమైనది" అని పలికి గిరుక్కున మరలిపోయెను. భీమసింహుఁడు వెలికివచ్చెను. అతని కంటికి నొక్క సారిగ నేఁడువందల మేనాలు గోచరించెను. అందలములఁ గ్రిందదింపి చాకలివాండ్రొక్కొక్క దాని ప్రక్క నెనమండుగురు చొప్పున నిలువబడియుండిరి. ఇదేమివింత? యని భీమసింహు డొక్క శిబికను సమీపించెను.

ఒకచాకలవాడు—(నమస్కరించి) "రాణా వారికి జయము. మేము చాకలులము కాము; సైనికులము. అందలము లోనివారు స్త్రీలుగారు! రసపుత్రవీరులు. అదిగో! మందిరమును బ్రవేశించిన పద్మినీదేవి విగ్రహము దేవరవారి సేనాని వీరసింహునిది ఈ శిబికలలోని వారు వెలికిరాఁకముందు మీరు పరిసరము దాటవల యును. తమ పంచకల్యాణి కంటనీరు గార్చుచు, శ్రీవారి రాకకై బయట నిల్చియున్నది.

భీమ – సరియే! మా మహారాణి యెక్కడ?

చాకలి – చిత్తూరు కోటలో, నంతఃపురమున...

భీమ – కొమరుఁడు కుశలమా? అతఁడెక్కడ?

చాకలి – దేవిగారు యువరాజుగారిని నగరాంతమున కనిపి రని వినికిడి. వివరములు తెలియవు.

“అగుచో మంచిది రసపుత్రవీరులారా! దిగుడు”
అని భీమసింహుఁ డొక్కసారి గర్జించెను. అందలములనుండి
సాయుధులై సైనికులు వెలికురికిరి. వారలెల్ల చేతికర్రల
నుండి కత్తులుదూసి, బారులుతీర్చి నిలువఁబడిరి. మందిరము
నుండి వీరనరసింహుఁడు ముందునకరిగి సేనను నడిపెను.
భీమసింహుఁడు వెలికేగి యశ్వము నధిరోహించి రణమున
కవతరించెను. అల్లాయుద్దీ నదిచూచి యాశ్చర్యపడి సేనలు
సన్నద్ధపఱపించి రణమునకుబురికొల్పెను. తీవ్రమైనసమరము
ప్రబలి, బాదుషా సైనికులు రాజపుత్రులను చిత్తూరునకు
దఱిమికొట్టిరి. అందలియుద్ధము మహాఘోరము. రసపుత్రులు
లెక్క కొక్కరైనను మిగులరైరి. రసపుత్ర వీరశిరోమణి
చిత్తూరు రాణా, భీమసింహుఁడు వీరస్వర్గము నలంకరించెను.
అల్లాయుద్దీ నానందపరవశుఁడై పాడుబడిన చిత్తూరుకోట
బ్రవేశించి రాణివాసమునకు మొగమై నడువసాగెను. ఆ
మార్గముననే అంతఃపురకాంతల నాహ్వానించి నుసియైయున్న
చితి కానుపించెను. పద్మిని యెక్కడ? పద్మిని యెక్కడ?”
అని యల్లాయుద్దీను వెదుకసాగెను. “నీకామె చిక్కనట్టిదా?
ఆమె యుందే యాహుతియైనది.

పద్మిని పంతము చెల్లించుకొని మాన సంరక్షణము
సల్పుకొనగాఁ, బాదుషా శపథము తీర్చికొని చిత్తూరును
వల్లకాటిదిబ్బ గావించినాఁడా!” అని యచ్చటి వెలిబూది
చెలరేగి పరిహాసము గావించెను.